

సాంచీ స్తూపం తూర్పుద్వారం
(వెనుక కనిపించేది స్తూపభాగం)



అతిమనోహరమైన బుద్ధ శిరస్సు
గాంధారశిల్పం, క్రీ. శ. ౪-వ, ౫-వ శతాబ్దాలనాటిది.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.



సంపుటము 50
సంచిక 39
30.5-56

సచిత్రవారపత్రిక
**Founder : K. NAGESWARA RAO**

దుర్ముఖ వైశాఖ బహుళ పంచమి బుధవారం

బుద్ధ జయంతి

ప్రత్యేక సంచిక

# విషయానుక్రమణిక

ముఖ చిత్రం : "సమ్యక్ సమాధి"
చిత్రకారుడు : వరద రామలింగేశ్వరరావు



స్థలాభావం చేత ఈవారం సినిమాశీర్షిక, "సాగరగర్భంలో సాహస యాత్ర" సీరియల్ ఆపివేయబడినవని మనవి.

# బుద్ధచర్య

వైశాఖ శుద్ధపౌర్ణిమ బుదుని పుట్టినరోజు. ఆయన ధర్మాన్ని సాక్షాత్కరింపు కున్న దినం కూడా ఒక వైశాఖపూర్ణిమే. మరి ఆయన మహాపరినిర్వాణము కూడా మరియొక వైశాఖ పూర్ణిమరోజునే జరిగింది. ఇట్లా బౌద్ధధర్మంలో వైశాఖ పూర్ణిమ అతి పవిత్రమైనదినంగా ఒనగూడి వుంది.

మహాపరినిర్వాణంనాటికి బుద్ధునికి 80 ఏండ్లు. ఇది జరిగి ఇప్పటికి 2500 ఏండ్లయినది. అనగా 2580 సంవత్సరాల క్రితము వైశాఖ పూర్ణిమ నాడు బుద్ధుని జన్మము. ఇప్పుడు బుద్ధగయలోను, ఇతర బౌద్ధ పుణ్య క్షేత్రాలలో జరుగుతున్న ఉత్సవం ఆయన జన్మదినోత్సవం కాదు. మహాపరినిర్వాణం యొక్క స్మృత్యుత్సవము

హారీత శివశర్మ

బుద్ధుని జీవితంలో నాలుగు ప్రధానమైన ఘట్టాలు ఉన్నాయి. 1. మహాభినిష్క్రమణము, 2. ఆయన ధర్మాన్ని సాక్షాత్కరింప చేసుకొనడం, 3. ధర్మచక్ర ప్రవర్తనము. 4 మహాపరినిర్వాణము అనగా ఆయన సిద్ధి పొందడం. ధర్మమును సాక్షాత్కరింపచేసుకొనుటను బౌద్ధులు సంబుద్ధి అని అంటారు. సంబోధి అనికూడా అంటారు. ఈ రెండు మాటలకు అర్థము జ్ఞానము అని; జ్ఞానము సాధించినవాడని.

బుద్ధుని జన్మము లుంబినీవనంలో. ఇది కపిలవస్తుకు, దేవదాహమునకు మధ్య వుంది. దేవదాహము బుదుని తాతగారి వూరు; తల్లి పుట్టినవూరు. ఆమె కాన్పునకు పుట్టినింటికి పోతూవుండగా దారిలో ఈ వనములో ప్రసవించింది. ప్రసవించిన అనంతరం, బుదునితల్లి మహామాయ, 7 రోజులుమాత్రమే జీవించింది. అప్పుడు ఆయన్ను పెంచే భారం అంతా ఆమె చెల్లెలు, శుద్ధోదనుని ఇంకొక భార్య, గౌతమి వహించింది. ఈమెను బౌద్ధులు మహా ప్రజాపతి గౌతమి అంటారు. ఈమె పుత్రుడు నందుడు. ఈ

సారనాథ్‌లోని ధమేక్ స్తూపం; బుద్ధుడు ధర్మబోధ ప్రారంభించిన స్థలం



# బుద్ధచర్య 

సందునిగురించే మహాకవి అశ్వఘోషుడు సౌందరనందం రచించాడు.

బుద్ధుడు బుద్ధుడుకాకముందు ఆయన పేరు సిద్ధార్థుడు. సిద్ధార్థుడు బుద్ధుడు అయ్యేదాకా ఆయన్ను బౌద్ధగ్రంథాలు బోధిసత్త్వుడనే వర్ణిస్తాయి. బోధిసత్త్వుడైన సిద్ధార్థుడు లోకవ్యవహారమునందు మహాభినిష్క్రమణకాలందాకా ఉపేక్షనే వహించాడు. ఉపేక్ష అనగా ఔదాసీన్యముకాదు. లోకవ్యవహారము సర్వమున్నూ అనిత్యమని తెలియుటవలన కల్గే పరమ విరాగభావాన్ని బౌద్ధులు ఉపేక్ష అన్నారు. అందువల్లనే అర్జునికి అదిలో అతని మామగారైన సుప్రబుద్ధుడు పిల్లను ఈయ నంటాడు. అటువంటి పట్టులు వచ్చినప్పుడు సంపూర్ణ పురుషుడైన సిద్ధార్థుడు తన పురుషకారాన్ని ప్రదర్శించి లోకవ్యవహారమునందు తనకు పురాజన్మ పారంపరిగా వచ్చిన మహాసంస్కారాన్ని ప్రదర్శిస్తాడు. సుప్రబుద్ధుని కూతురు యశోధరను సిద్ధార్థుడు ఇట్లానే పెండ్లియాడాడు. అయినా ఆవిడతో ఆయన కాపరం చేసింది కొద్ది సంవత్సరాలు. ఆమె యందు తనకు పుత్రు కల్గినరోజునే సిద్ధార్థుడు ధర్మగవేషణార్థం ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు. ఈ వెళ్లిపోవడమునే మహాభినిష్క్రమణం అంటారు. అప్పటికి సిద్ధార్థుని వయస్సు ముప్పదియేండ్లకు లోపు.

మహాభినిష్క్రమణం అనంతరం ఆయన 7 సంవత్సరాలు ఆయా రాజ్యాలలో తిరిగాడు. పరివ్రాజకుడై తిరిగాడు. అలారకాలామునివద్ద, ఉద్దక రామపుత్రునివద్ద గురుకులవాసం చేశాడు. ఇతర మతములతో సిద్ధార్థునికి సంబంధం ఈ కాలంలో కల్గింది. ఆ మతములవల్ల బంధవిముక్తి పొందడం అసాధ్యమని ఆయన తెలుసుకున్నాడు. అందువల్లనే ధర్మగవేషణ మార్గాన్ని స్వయంగా వెదుకున్నాడు. విద్యుకాని ధర్మాన్ని సాక్షాత్కరింపజేసుకొని, బుద్ధుడైనాడు.

సిద్ధార్థుడు బుద్ధుడైంది బోధిగయలో. ఆ కాలంలో ఈ ప్రాంతాన్ని ఉరువేలం అనే వాళ్లు. వినయపిటకంలోను సూత్రపిటకంలోను ఈ ధర్మసాక్షాత్కార కథనముంది. సూత్రపిటకంలో స్వయంగా బుద్ధుడే తన యీ ధర్మసాక్షాత్కార కథనాన్ని భిక్షులకు చెప్పినట్లు వుంటుంది. వినయపిటకంలో ఆ కథయొక్క సర్వవివరాలు ఇవ్వబడి వున్నాయి. బోధికథానిశ్రితమని, అజపాలకథానిశ్రితమని, ముచలిందకథానిశ్రితమని, రాజాయతనకథానిశ్రితమని, మారకథానిశ్రితమని, బ్రహ్మయాచకథానిశ్రితమని, ఇన్ని భాగాలుగా వివరింపబడివుంది. "దుర్దశము, గంభీరము, దురనుబోధము, పండిత వేదనీయము, అయిన ధర్మాన్ని ఆయన సాక్షాత్కరింపజేసుకున్న విధం అంతా ఇక్కడ వర్ణింపబడింది. ఈ సందర్భంలోనే బుద్ధుడు తన్నుగూర్చి ఉపాకుడు అనే ఒక పరివ్రాజకునితో ఇట్లా చెప్పుతున్నాడు:

"అహం హి అరహాలోకే
అహం సత్థా అనుత్తరో
ఏకోమ్హి సమ్మా సంబుద్ధో
సీత భూతోస్మి నిబ్బుతో
ధర్మచక్కం పవత్తేతుం
గచ్ఛామి కాసికాపురం."

ఇట్లా సిద్ధార్థుడు బుద్ధుడు, తథాగతుడు, సుగతుడు, అనంతజినుడు అయినాడు.

## 2

"ధమ్మచక్కం పవత్తేతుం, గచ్ఛామి కాసికాపురం." అది. కాశీనగరంలో బుద్ధుడు ధర్మచక్రప్రవర్తనం ఆరంభించాడు. అక్కడ తొలిధర్మబోధం ఋషిపతనమృగదావంలో జరిగింది. ఇప్పుడు ఈ మృగదావాన్ని సారనాథ్ అంటున్నారు. ఇక్కడ ఈ బుద్ధుడు ప్రథమంగా తన ధర్మాన్ని పంచవర్గీయులనే భిక్షువులకు విన్పించాడు. వీరు ఐదుగురు. ఆదిలో సిద్ధార్థుడు బుద్ధుడౌతాడని తెలిసి, అతనివెంట ఉరువేలం వెళ్ళారు. అక్కడ సిద్ధార్థుడు ఆదిలో శరీరాన్ని శోషపెట్టుకుంటూ తపస్సు మొదలుపెట్టాడు. అది వారికి నచ్చి ఆయనకు శుశ్రూష చేశారు. తర్వాత ఆ మార్గం సరియైనదికాదని సిద్ధార్థుడు పిండపాతానికి బయలుదేరాడు. అది ఈ పంచవర్గీయులకి నచ్చలేదు. తపోమార్గం నుండి సిద్ధార్థుడు భ్రష్టుడైనాడని ఈ ఐదుగురు అతణ్ని వదిలిపెట్టి వెళ్ళిపోయారు. కాశీ చేరుకున్నారు. వీరిలో కౌండిన్యుడు ప్రముఖుడు. పాళీలో ఇతణ్ణి కొండిణ్ణ అంటారు. బుద్ధుని ధర్మబోధ వినీవినడంతోనే ఇతడు అర్హతుడౌతాడు. బౌద్ధులు ఇతణ్ణి మహాకొండిణ్ణ అంటారు.

పంచవర్గీయుల తర్వాత యశకుల పుత్రుడు, ఆ అనంతరం భద్దవర్గీయులు ఈ మతంలో చేరారు. దానితో ధర్మప్రచారం ఒక్క బుద్ధుడేగాక అర్హతులైన అతని శిష్యులుగూడా సాగిస్తూ వచ్చారు. బుద్ధుడు తిరిగి ఉరువేలం వచ్చి ఉరువేల కాశ్యప, నదీకాశ్యప, జటాకాశ్యపులనే జటులను మతంలో చేర్చాడు. వాళ్లు ఇట్టి కర్మఠులు; సిద్ధులు. బుద్ధుడు అంతకన్నా ఎక్కువ సిద్ధులను ప్రదర్శించి వారిని జయించి, తన ధర్మం వారికి ఇచ్చాడు. వీరి ఈ బుద్ధధర్మప్రవేశంవల్ల మగధ రాజధాని రాజగృహం అంతా ఈ ధర్మం అంటే సుముఖం అయింది. మగధరాజు శ్రేణిక బింబిసారుడు ఈ ధర్మాన్ని అవలంభించాడు. తర్వాత చాలా మంది క్షత్రియులు ఈ మతాన్ని పుచ్చుకున్నారు. మల్లులు, లిజ్జీయులు, విద్ఛవులు, కోసలులు, కాశీయులు అంతా పుచ్చుకున్నారు. ఆకాలంలో మధ్యదేశం అని దేన్ని అనేవారో, ఆదేశం అంతటా ఈ ధర్మం ప్రచారం అవుతూవచ్చింది. మహారాజులేగాక మహారాణులుగూడా బుద్ధుని మతంలో ప్రవేశించారు. ఇట్టివారిలో ఖేమ వాసభ, మల్లిక మొదలైన రాణులు చాలా ప్రసిద్ధులు.

## 3

బుద్ధుని శిష్యవర్గంలో ప్రధానులు సారిపుత్ర, మొగ్గలానులు. ఇందులో సారిపుత్తుణ్ణి ధర్మసేనాపతి అంటారు. వీరి స్థాయి శిష్యగణమే బుద్ధునికి ఇంకా చాలావుంది. అశ్వజిత్తు, మహాకశ్యపుడు, మహాకాత్యాయనుడు, కప్పినుడు, అనురుద్ధుడు, ఉపాలి, రేవతుడు, నందుడు, ఆనందుడు ఇట్లా చాలా మంది. వీరందరు అర్హతులు. ఇంకా శోణకోటి, శోణకుటికన్న అని, దర్భమల్లపుడు అని మరికొందరు అర్హతులు వున్నారు. బౌద్ధపరిభాషలో అర్హతులనగా జీవన్ముక్తులు.

ఇట్టి జీవన్ముక్తులు స్త్రీలలోగూడా వున్నారు. వారిలో ప్రసిద్ధులు మహా ప్రజాపతి గోతమి, ఖేమ, ఉత్పలవర్ణ, పాటచ్చర, ధమ్మదిణ్ణ, భద్దలి, కుండలకేసి మొదలైన వారు. ఇందులో భద్దలి వైదేహీపుత్ర అజాతశత్రుని భార్య.

## 4

బుద్ధుడు, బుద్ధుని శిష్యులలో కొందరు ఋద్ధిసంపన్నులు. ఋద్ధి అనగా యోగసాధనలో లభించే అణిమాద్యష్టసిద్ధుల వంటిది. బుద్ధుడు చిన్నతనంలోనే ఇట్టి అద్భుతాలు ప్రకటించినట్లుగా గాథలు వున్నాయి. పుట్టినప్పుడే లేచి ఏడడుగులు వెయ్యడం, చెట్టుక్రింద పడుకోపెట్టగా సాయంత్రం అయినా ఆ చెట్టు నీడ కదలక, బుద్ధుని నడినెత్తిన గొడుగువలె నీడను పట్టడం మొదలయిన వృత్తాంతాలు బుద్ధుణ్నిగూర్చి కథల్లో వినవస్తాయి. ఇక ఆయా శిష్యులను చేర్చుకోవడంలో, తన మతంయొక్క ప్రశస్తిని చాటడంలో, ప్రచారం చెయ్యడంలో గూడా బుద్ధుడు ఈ అద్భుత ప్రక్రియలను ఉపయోగించినట్లు పిటకాల్లో వుంది. బుద్ధుని శిష్యులలో ఇట్టి అద్భుతాలు ప్రదర్శించడంలో మొగ్గలానుడు మేటి. తక్కువ

# వైశాఖపూర్ణిమ

'శాస్త్రి'

లోకమే పాలవెన్నెల వెల్లువయ్యెనో!
ఆకాశ మానంద హంసమై యెగసెనో!
నాకమ్మునుండి నరలోక వీథులదాక
ఒకటే మహోల్లాస మొకటే కలకలమ్ము
వైశాఖ పూర్ణిమా హాసపేశలవేళ!
శ్రీ సుగతదేవ భువనోదయోత్సవ వేళ!

కపిలవస్తు పురమ్మొకండేల! సకలమ్ము
విపులాతలము హర్ష పుష్పవర్షమయమ్ము!
ఆలపొదుగుల పాలు జాలువారినవంట!
నీలాలనింగి కన్నీట దోగినదంట!
అచ్చరల నూపుర చలచ్చరణ శోభలో
ఆ రాత్రి యెంత కన్నులపండు వయ్యెనో!

అలనాటి మహిత సామ్రాజ్యాలు మిన్నంది
శిలనైన, కలనైన నిలువకే నశియించె!
సర్వజ్ఞదేవా! ప్రశాంత మూర్తీ! ప్రభూ!
సర్వమ్ము నశ్వర మశాశ్వత మ్మన్నావు!
కాని, నీ ప్రేమార్ద్ర గళగీత నిత్యమై!
మానవోదయ శాంతిమంత్రమైనినదించె!

హింసాక్రకచమయ్యె నేటి మానవమేధ
మాంసరుధిరోన్మత్తమయ్యె యంత్ర విజేత
కరుణావిహీనమై మరణించె మానవత
అరుణారుణమ్మయ్యె మారణాయుధగాథ
నీ కృపాపంచశీలాహ్వాన మికనైన
మాకై భువనశాంతి మురళియై మ్రోగేన!

పేరాసకార్చిచ్చు పెరటిలో దోచేన?
పారిజాత ప్రసవ పరిమళము సుంతైన
కనులుండి యక్కటా! కాననేరరుగాని,
వీను లుండియు గూడ వినిపింపదో గాని,
అదయ దురహంకార ఝంఝానిలములోన
హృదయవిజ్ఞానదీపిక మెరయనేర్చునా!

ధ్యానస్తిమిత ధీరమౌనముద్రవహించి,
లోన కరుణాబ్ధి కల్లోలాలు నిండించి,
పెదవిపై చిరునగవు లుదయమై చెలరేగ
పృథివిపై గళదమృత మథనోత్సవముసాగ
దీనబంధూ! బుద్ధదేవ! నీమూర్తి యిక
మానవావళి కుషోమాంగళ్య మగుగాక!

వారుగూడా ఈ బుద్ధి ప్రక్రియలలో సిద్ధహస్తులే ననిపిస్తుంది.

బుద్ధుడికి, అతని అనుయాయులకి గూడా స్వర్గాల్లో, నరకాలలో నమ్మకం వుంది. ఒక బోధిసత్త్వుడు బుద్ధుడు అయ్యే జన్మ ఎత్తేముందు తుషితస్వర్గంలో వుంటాడు. అయితే ఈ స్వర్గాలలో వుండే దేవతలకు వైదికవాఙ్మయంలో దేవతలకు తేడావుంది. బౌద్ధుల దేవతలు అనిమిషులు కారు. వారు అమృతులు కారు. వారుగూడా బుద్ధుని శాసనాన్ని ఆమోదిస్తారు. ఇదే విధముగా వైదికుల ఊర్ధ్వలోకాలకు, బౌద్ధుల ఊర్ధ్వలోకాలకు, వైదికుల అధోలోకాలకు బౌద్ధుల అధోలోకాలకు తేడా ఉంది. బౌద్ధుల ఊర్ధ్వ లోకాలు నాలుగు విధాలుగా వుంటాయి. (1) అరూపలోకాలు. (2) రూపలోకాలు. (3) కామలోకాలు. (4) కామావచారద్వ లోకాలు.

దేవతల్లో పరనిమిత్త వశవర్తిదేవతలని, నిర్మాణరతి దేవతలని, తావతింశకులని, చాతుర్మహారాజులని నాలుగు రకాలుగా ఉన్నారు. యక్షులు, గంధర్వులువున్నారు. అధోలోకాలలో నాగాదిలోకాలు వున్నాయి. నరకాలలో ఘోరమైన నరకం అవీచీ నరకం. బుద్ధుని విరోధి దేవదత్తుడు ఈ నరకంపాలే అయినాడు.

బౌద్ధుల గాథలలో మారుడు ఒక విచిత్రమైన పాత్ర. ఇతడు వశపర్తిలోకాధిపతి. ఏసుక్రీస్తు మతంలో సైతానువంటివాడు. బుద్ధుణ్ని తప్పుదారుల్లోకి లాగడానికి, బుద్ధుని నిశ్చయాలను సడలించడానికి ప్రయత్నం చేస్తూవుంటాడు. ఇతనికి ముగ్గురు కూతుళ్లు. రూప, రాగ, తన్హా—వీరి పేర్లు. బుద్ధుడు సంబుద్ధి కాబోతున్న సందర్భంలో మారుడే గాక, అతని సైన్యమే గాక, ఈ ముగ్గురూ కూడా బుద్ధుణ్ని భ్రష్టుణ్ని చేద్దామని ప్రయత్నిస్తారు. కాని బుద్ధుడు వీరికి లొంగడు. ఈ మారుణ్ని గురించిన వృత్తాంతం సూత్తపిటకంలో వుంది. మరి ఈ మారుడు, మన పురాణాల్లో కన్పించే మారుడు ఒకటికాదు. పురాణాల్లో మారుడు మదనుడు; చిత్తజుడు; మన్మథుడు. బౌద్ధుల మారుడు కాదు. బౌద్ధుల మారుడు పాపి. బుద్ధుడు అతణ్ని అట్లాగే సంబోధిస్తాడు. బుద్ధుని జీవితంలో ఆదినుంచి తుదిదాకా ఈ మారప్రసక్తి వుంటుంది. మహాభినిష్క్రమణ సమయంలో, ధర్మప్రవర్తనకాలంలో, ఆఖరికి పరినిర్వాణసమయంలో ఈ మారుడువస్తాడు. బుద్ధుడికి పరినిర్వాణకాలం సమీపించినట్లు మొదట చెప్పింది ఈ మారుడే. సూత్తపిటకంలో ఈ ఉదంతం విపులంగా వుంది.

## 5

బుద్ధుని ఆకార రూపాలను గురించి బౌద్ధ గ్రంథాలలో విరివిగా వర్ణనలు వున్నాయి. ఆయన 216 మాంగళ్య లక్షణాలతోను, 32 మహాపురుష లక్షణాలతోను 80, అనువ్యంజన లక్షణాలతోనూ పుట్టాడు. మాంగళ్యలక్షణాలలో చక్రవర్తికి వుండవలసిన నాల్గు మహాలక్షణాలు ఆయనయందు వున్నాయి. చక్రము, ఆ చక్రాన్ని చుట్టి బండిచక్రం ఆకుల్లా చుట్టూ విరిసిన 2 వేల



బుద్ధుడు సంబుద్ధిపొందిన బుద్ధగయలోని మహాబోధి విహారం; ఈ వృక్షచ్ఛాయనున్న వజ్రాసనంపై బుద్ధుడు సమాధినిష్ఠుడైనాడు.

# ★ బుద్ధచర్య ★

రేఖలూ, వాటిచుట్టూ మళ్ళీ ఒక వలయం, ఈ రేఖలమధ్య అల్పాల్పములైన వేలకొద్దీ చక్రాలు, ఇట్లా చక్రవర్తికి వుండవలసిన లక్షణాలు వున్నాయి. ఆయన పాదాలు బంగారపు పాదుకల్లాగా వుండేవి. రెండు అరికాళ్ళలోను చక్రాలు; మడమలు బంగారం ముద్దచేసి పెట్టినట్లు వున్నా, అతి మృదువులు. మనిషి ఆజానుబాహువు. పులి నాలుకతో మెరుగుపెట్టిన ప్రతిమవలె ఆయన శరీరం అతి మృదువుగాను, నున్నగాను వుండేది. శరీరం వంగినట్లుగాక నిటారుగా వుండేది. మనిషి సింహంలాగా వుండేవాడు. నిండుగా మర్రిచెట్టువలె వుండేవాడు. పళ్ళు ముత్యాల్లాగా వంకలులేనివి. నక్షత్రాల్లాగా మెరిసేవి. నాలుక పొడుగు. చాచితే ముక్కు అందుకునేట్లు సాగేది. కళ్లు ఇంద్రనీలమణుల్లాగా మెరుస్తూ వుండేవి. వాక్కు మృదువు; గంభీరం.

ఆయన సర్వాంగాలు ఒకదానికి ఒకటి తగినట్లు వుండేవి. చేతిగోళ్లు తామ్రవర్ణాలు. ఆయన పాదం సమంగావుండి నేలను సమంగా తాకేది. హంసలాగా, పట్టపు ఏనుగలాగా, సింహంలాగా, వృషభంలాగా ఆయన నడిచేవాడు. అమేయమైన బలం కలవాడు. ఎప్పుడూ ప్రసన్నంగా వుండేవాడు. ఆయన పెదిమలు ఎఱుపు; చేతిప్రేళ్లు పొడుగు; మడమ వెడల్పు; కనుబొమ్మలు తీర్చినట్లు మృదువులు; సువాసనాభరితాలు. శరీర రోమాలు సమంగా, మృదువుగా, నీలంగా వుండేవి. శరీరం కాంతివంతమై కిరణాలను వెదజల్లుతున్నట్లు వుండేది.

బుద్ధుడు నడిచేప్పుడు ఎప్పుడు కుడికాలు ముందు పెట్టేవాడు. కూర్చున్నా, నిలబడినా, పడుకున్నా అంతే. నడిచేప్పుడు పెద్ద అంగలువేసి నడిచేవాడు కాదు. సమంగా నడిచేవాడు. నాతివేగముగా, నాతిమందంగా అతని గమనం వుండేది. పిండపాతానికి పోయినప్పుడుగూడా ఇదేవిధంగా నడిచేవాడు. అట్లా నడిచినా అది తొందరగా నడిచినట్లే వుండేది. ఆయనతో బయలుదేరి భిక్షువులు వెనకపడిపోయేవాళ్లు. ఆయన వారికోసం ఆగేవాడుకాదు నడిచేప్పుడు కొందరికి మోకాళ్ళు కొట్టుకుంటాయి కొందరికి మడమలు కొట్టుకుంటాయి. బుద్ధుడికి అట్లా కొట్టుకునేవికాదు. నడిచేప్పుడు భుజాలు ఎగురవేసేవాడు కాదు. వెనక్కు విసిరేవాడు కాదు. అట్లా అని బిగపట్టేవాడు కాదు. చేతులను ఎక్కువ వూపేవాడూ కాదు. శరీరోర్ధ్వభాగం స్తిమితంగా వుండేది. అధోభాగంలో మాత్రమే ఆ కదలిక కన్పించేది. అలుపు వుండేదికాదు. నడుస్తున్నప్పుడు వెనక్కు చూడాలంటే తలమాత్రమే త్రిప్పి చూచేవాడుకాదు. మనిషి అంతా అటుతిరిగేవాడు. ఆ తిరగడం పట్టణపుటేనుగు తిరిగినట్లు వుండేది. ఎప్పుడూ పైకిచూచేవాడు కాదు. అట్లా అని అధోముఖుడయ్యీ నడిచేవాడు కాదు. ఇటుఅటు చూస్తూ ఆయన ఎప్పుడు నడిచిందిలేదు. దూరంలో దేన్నైనా చూడాలంటే మామూలు నేత్రాలతో గాక బోధినేత్రాలతో చూచేవాడు. ఏ ఇంట్లో గాని అవసథంలోకి ప్రవేశిస్తున్నప్పుడు శరీరాన్ని వంచేవాడుకాదు. ఆసనంమీద కూర్చునేటప్పుడు ఊతఏమీ లేకుండానే కూర్చునేవాడు. కూర్చున్నప్పుడు విసనకఱ్ఱను ఆడించడం, నీళ్ళను కెలకటం మొదలైన పనులు కొందరు చేస్తారు. ఆయన అటువంటివేమీ చేసేవాడుకాదు. మరికాళ్ళమీద కూర్చోడం, కాళ్ళు ఆడించడం, ఆయన పద్ధతికాదు.

బుద్ధునికి ఏవిషయాన్ని గురించి ఎప్పుడూ భయం అంటూ వుండేదికాదు. ఏదో పని పెట్టుకున్నాము ఏమైపోతుందో అన్న ఆదుర్దా వుండేదికాదు. విచికిత్స అన్నది ఆయనకు ఎప్పుడూ దూరంగా వుండేది. పిండపాతానికి పోయినప్పుడు భిక్షాపాత్రను మరీ ఎత్తుగానుమరీ, క్రిందుగాను పట్టేవాడు కాదు. సమస్థాయిలో పట్టేవాడు. దొరికిన భిక్షలో నాల్గోవంతుమాత్రమే భుజించేవాడు. ఎవరు ఎన్ని రకాల భక్ష్యాలతో నైనా భిక్ష పెట్టనీ అంతే, ఆ నాల్గోవంతే తినేవాడు. భోజనం చెయ్యడంలో గూడా నోట్లో కుక్కుకోవడం, ఆదరాబాదరా తినడం వుండేది కాదు. ఒక ముద్ద పెట్టుకొని, దాన్ని పూర్తిగా నమిలి, మ్రింగిన తర్వాతనే ఇంకో ముద్ద పెట్టుకునేవాడు. ఒకళ్ల తృప్తికోసం, మెరమెచ్చులకోసం ఆయన ఎప్పుడూ భిక్షను స్వీకరించింది లేదు. శరీర పుష్టికోసం, అందాన్ని పెంచుకోవడం కోసం, ఆయన భిక్షను గ్రహించేవాడు కాదు. బుభుక్షను తీర్చుకోడానికిమాత్రం భుజించేవాడు. దేహాన్ని నిల్పడం కోసం మాత్రమే ఆహారాన్ని స్వీకరించేవాడు. "ధర్మదేశనం" చెయ్యవలసిన అవసరం లేకపోతే మౌనంగా వుండేవాడు.

బుద్ధునికి కష్టమైన పని అంటూ ఏమీ లేదు. ఏపనినైనా సరె ఎవ్వరు చేయలేనట్లు చేసేవాడు. మంచి చీవరం ధరించాలని, ఉత్తరాసంగం మంచిది వుండాలని ఆయనకు ఎప్పుడూ లేదు. ఆయన అతిసామాన్యమైన చీవరం ధరించేవాడు. అట్లా అయినా చీని చీనాంబరాలు ధరించి వచ్చిన రాజులు, రాణులు, కులపతులు, కులపత్నులు, ఆయన ముందు వెలవెలాపోతూ వుండేవాళ్ళు. ఆయన అందం అటువంటిది. ఉరువేలం

పట్టీకముందు మహాభినిష్క్రమణం అనంతరం రాజగృహానికి వచ్చిన సిద్ధార్థుణ్ణి చూచి బింబిసారుడు, అక్కడి గల రాజపురుషులు గూడా యక్షుడో, గంధర్వుడో, సాక్షాత్తు త్రివింశస్వర్గాధిపతి అయిన శక్రుడో అనుకున్నారు.

## 6

బుద్ధుని ధర్మబోధ బహువిధాలుగా సాగేది. ఒకప్పుడు ఆయన భిక్షువులను అందర్నీ సమావేశపరచి ధర్మబోధ చేసేవాడు. ఒకసారి ఎవరి యింటికన్నా భిక్షకు పోయినప్పుడు అక్కడ ధర్మాన్ని ఉపదేశించేవాడు. ఈ చెప్పడం సోదీగా ఎప్పుడూ వుండేది కాదు. అనేక ఉపమానాలు, కథలు, పొదిగి బోధ చేసేవాడు. ఆయన ఇట్టి సందర్భాలలో ఉపయోగించే అలంకారాలు అతి బ్రహ్మాండంగా వుండేవి. "ఆదిత్త పరియాయం" అని వినయపిటకంలో ఒక ఖండం వుంది. ఇది "గయాసీసం"లో భిక్షువులను సంబోధించి చేసిన ధర్మబోధ. అంతా ఒక మహారూపకాలంకారం. "సబ్బం, భిక్ఖవే, ఆదిత్తం" అంటూ ఆయన దాన్ని ప్రారంభిస్తాడు. "చక్ఖుం ఆదిత్తం చక్ఖు విఞ్ఞాణం ఆదిత్తం, సోతం ఆదిత్తం, సద్దా ఆదిత్తం, ఘానం ఆదిత్తం, గంధా ఆదిత్తం, జివ్హా ఆదిత్తం" అంటూ ధర్మాన్ని ఆదిత్యపరంగా వ్యాఖ్యానం చేస్తాడు. ఈ చెప్పడం మామూలు ఉపన్యాసధోరణిలో చెప్పడం కాదు. మధ్య మధ్య ప్రశ్న; ప్రశ్నకు తానే ప్రత్యుత్తరం చెప్పడం; ఇలా సాగుతుంది. ఈ ఆదిత్త పరియాయాన్నే మళ్ళీ ఉదాహరణగా తీసుకుంటే "చక్ఖుం భిక్ఖవే ఆదిత్తా, రూపా ఆదిత్తా, చక్ఖుమె విఞ్ఞాణం ఆదిత్తం, చక్ఖు సంఫస్సో ఆదిత్తో," అంటూ చెప్పుకుపోయి "కేన ఆదిత్తం?" అని ప్రశ్నించి తానే 'రాగగ్గినా దోసగ్గినా, మోహాగినా ఆదిత్తం జాతియా జరాయ మరణేన సోకేహి పరిదేవేహి దుఖ్ఖేహి దోమనస్సేహి ఉపాయాసేహి ఆదిత్తం' తివదామి" అని ప్రత్యుత్తరం చెబుతాడు.

ఒకొక్క సందర్భంలో తన పూర్వ జన్మ వృత్తాంతాలనే ధర్మవ్యాఖ్యానం చెయ్యడం కోసం ఉదహరిస్తూ వుంటాడు. ఇట్లా త్రిపిటకాలలో బుద్ధుని జాతక కథలు చాలా బుద్ధుడు చెప్పినట్లే ఉట్టంకితాలై వున్నాయి. తిత్తిరిజాతకం, దీర్ఘాయుజాతకం, మహాసుదస్సన జాతకం, ఇవ్వన్నీ ఇట్లా చెప్పినవే.

ఒకొక్క సమయంలో ధర్మాన్ని, సూక్ష్మంగా ఒక్క గాథలో ఇమిడ్చి చెప్పడం గూడా వుంది. గాథ ఒక శ్లోకం వంటిది. ఏదన్నా ఒక మహాభావం వచ్చినప్పుడు దాన్ని అట్టి గాథలో పొదిగి చెప్పడం వుంది. అభిధమ్మపిటకంలో భాగమైన ధమ్మపదం చాలాభాగం ఇట్లా గాథామయంగానే వుంటుంది. ఆ గాథను ఏ సందర్భంలో ఎందుకు చెప్పింది గూడా వుంటుంది.

ఒకొక్కప్పుడు చమత్కారంగా మాట్లాడి ఒకొక్కరిని ధర్మానికి అభిముఖులనుగా చేయడం వుంది. మగధలో ఒక బ్రాహ్మణుని వృత్తాంతం ఇందుకుదాహరణంగా కన్పిస్తుంది. మగధలో ఆ బ్రాహ్మణుడు ఒక గ్రామంలో వ్యవసాయం చేసుకుంటూ జీవిస్తూ వుండేవాడు. ఒక రోజున పొలంలో అతడు పనిచేసుకుంటూవుండగా బుద్ధుడు ఆదారినే పోతూవుండగా పల్కరించి "ఏమి! శ్రమణ! నేను చూడు, కష్టపడి ఫలాన్ని పొందుతున్నాను. నీవు కష్టపడవు, ఏమి ఫలాన్ని పొందుతావు!" అని ప్రశ్నిస్తాడు. బుద్ధుడు ధర్మాన్ని క్షేత్రంగానూ, సాధన మార్గాలను వ్యవసాయంగానూ, ఫలాన్ని నిర్వాణంగానూ వర్ణించి, తాను ఒక వ్యవసాయం చేస్తున్నానని బదులు చెబుతాడు. అది విని ఆ బ్రాహ్మణుడు వీతమలుడు, వీతరజుడు అయి బుద్ధునికి, ధర్మానికి, సంఘానికి శరణు అంటాడు.

ధర్మాన్ని చెప్పేటప్పుడు, అది ఎన్ని లోకాలలో వినపడాలని ఆయన సంకల్పిస్తే అది అన్ని లోకాల్లో వినపడేది. ఎవరో ఒక ప్రత్యేక వ్యక్తిని ఉద్దేశించి చెబుతూ వుంటే, ఆ వ్యక్తికి తప్ప ఇంకొకరికి వినపడేది కాదు బుద్ధుని "ధర్మదేశనం" వింటే తిర్యక్కులు కూడా ధర్మమార్గప్రవిష్టాలయ్యేవని బౌద్ధుల గ్రంథాలలో వుంది. ఆయన చెప్పదలచుకున్నదాన్ని వితుగ్గా దీర్ఘంగా చెప్పేవాడు కాదు. అర్థం కాకుండా అతిక్లిష్టంగానూ చెప్పేవాడు కాదు. సమంగా, వింటున్నవాళ్లకు అర్థమయ్యేవిధంగా అర్థం చేసుకొని ధారణ చేయగల విధంగా చెప్పేవాడు.

బుద్ధుడు ఎప్పుడు గాని, ఎవర్ని గాని కఠినంగా మాట అని యెరుగడు. ఎవరన్నా కేకలు వేయవలసినప్పుడు "మోఘపురుష" అని మాత్రం అనేవాడు. దేవదత్తుడు అనే అతడు సంఘాన్ని విచ్ఛిన్నం చేసి, తిరిగి తన దగ్గరకు వచ్చినప్పుడు అతణ్ణి చూడనన్నా లేదు గాని, ఒక్క మాట అనలేదు.

## 7

ఇట్లా బుద్ధుని జీవితంగా సాగిపోయింది. ఇట్లా ఒక 40 ఏండ్లు ఆయన తన జీవితంలో ఈ ధర్మప్రచారంకోసం ధారపోశాడు. అనేకమంది శిష్యులను చేర్చుకొని అందర్నీ ఒక సంఘంగా ఏర్పాటుచేసి, తాను దానికి శాస్త అయి ధర్మాన్ని అనుశాసించాడు. బుద్ధునికి, బుద్ధుని సంఘానికి, బుద్ధుని ధర్మానికి అనేకమంది శరణుచొచ్చి ఉపాసకులు, ఉపాసికలు అయినారు. వీరిలో ధనవంతులు వున్నారు. బీదవారు వున్నారు. రాజులు వున్నారు. మహారాజులు వున్నారు. ఆకాలంలో గొప్పధనవంతులుగా ఎన్నబడిన అనాథపిండదుడు, భద్రుడు మొద



బుద్ధుని శిష్యులలో ముఖ్యులైన సారిపుత్త, మహామొగ్గలానుల పవిత్రాస్థికలకు ప్రణమిల్లుతున్న భిక్షుబృందం.

# ★ బుద్ధచర్య ★

శైవవాళ్లంతా బౌద్ధోపాసకులుగానే జీవితం గడిపారు. అనాథపిండకుడు కట్టించి బుద్ధునికి ఇచ్చిన జేతవనం ప్రపంచ ప్రసిద్ధివహించింది. మగధరాజు బింబిసారుడుగూడా ఒక వనాన్ని బుద్ధునికి ఇచ్చాడు. దాన్ని వేణువనం అంటారు. ఇట్లా మధ్యదేశంలో సర్వప్రాంతాల్లో బుద్ధుని సంఘానికి విహారాలు, ఆవసథాలు ఏర్పడ్డాయి. విశాఖ, మల్లిక, సుప్రియవంటి ఉపాసికలు ఈ ధర్మ ప్రభావానికి బహువిధాల సహాయాలు చేశారు. ఇట్లా ధర్మం సర్వరాజ్యాల్లోను ప్రచారితం అవుతూవచ్చింది. కాని సంఘంలో ఘర్షణలు రాకుండాపోలేదు. ఘర్షణలు వచ్చాయి. ఒకసారి దేవదత్తుడు ఎదురుతిరిగాడు. ఇతడు బుద్ధునికి దగ్గరచుట్టంఅయినా బుద్ధుడితో పడిందికాదు. ఇతడు గోతమక శాఖ అని ఒకరకం శ్రమణవర్గాన్ని సృష్టించాడు. సారిపుత్త, మొగ్గలానుల సహాయంతో బుద్ధుడు ఇతణ్ణి దండించగల్గాడుగాని, సంఘంలో ఘర్షణమాత్రం వదల్లేదు. మహాకాశ్యపుడు సంఘంలో కొన్ని పద్ధతులు తనకు నచ్చక అరణ్యావాసం వెళ్లిపోయాడు. బుద్ధుడు పెద్దవాడైనాడు. ఈ పెద్దతనంలోనే కోసలరాజు ప్రసేనజిత్తు కొడుకు విడూఢభుడు పోయి శాక్య రాజ్యాన్ని నాశనంచేసి, తానూ నాశనమైనాడు. ఇందులో శాక్యరాజ్యమూ తనకు కావలసిందే, విడూఢభుడూ కావలసినవాడే. కాని అంతా అట్లాఅయిపోయింది. భగవంతుడు అప్పుడుగూడా ధర్మప్రచారం చేసుకుంటూ ఒకచోటినుండి ఇంకోచోటికి పోతూ కాలాన్ని వెళ్లదీసాడు. ఈ ధర్మ సంచరణకాలంలోనే వైశాలిలో అంబపాలి ఆమ్రవనాన్ని బుద్ధునికి దానంచేసింది.

వైశాలిలో వున్నప్పుడే బుద్ధుడికి మహాపరినిర్వాణకాలం సమీపించినట్లు తెలుస్తుంది. ఆరోజున ఆయన ఆనందుడితోసహా, పిండపాతానికి బయలుదేరి, వైశాలిలోని చాపాల చైత్యంలో విశ్రాంతి తీసుకుందామని పోతాడు. అప్పుడు మారుడు బుద్ధుడికి కన్పించి "పరినిబ్బాతు దాని భన్తే భగవా, పరినిబ్బాతు సుగతో, పరినిబ్బాణకాలో దాని భన్తే భగవా" అంటాడు. దానికి బుద్ధుడు"అప్పోస్సుక్కోత్వం పాపిమహోహి, న చిరం తథాగతస్స పరినిబ్బాణం భవిస్సతి ఇతో తిణ్ణం మాసానం అచ్చయేన తథాగతో పరినిబ్బాయిస్సతీతి' అని సమాధానం ఇస్తాడు. ఈ తెలిసిన అనంతరం బుద్ధుడు భిక్షుసంఘందగ్గర సెలవు దీసుకోడానికా అన్నట్లు ప్రాణాలు బిగపట్టి, కుసినారానికి బయలుదేరాడు. ముందు వేలువగ్రామం వెళ్లి అక్కడనుంచి పావాగ్రామానికి వెళ్ళి, అక్కడినుంచి కుసినారం చేరుకున్నాడు. దారిలో పావాగ్రామంలో కుందుడు అనే ఉపాసకుని ఇంట్లో భిక్షను స్వీకరించాడు. ఈ ఉపాసకుడు పందిమాంసంతో బుద్ధునికి భిక్ష పెట్టాడు. బుద్ధునికి దానితో రక్త విరేచనాలు పట్టుకున్నాయి. అంతకుముందు నుంచీ గూడా ఆయన ఆరోగ్యం బాగా వుండటంలేదు. వేలువగ్రామంలో ఉండగానే శరీరం అస్వస్థమయింది. అప్పుడు ఆనందుడు అంటాడు. "భగవంతుడా మీ ఆరోగ్యం బాగుండలేదు. మీరు బాధపడుతున్నారు. నేను చూడలేకుండా వున్నాను. సంఘానికి ముందుగతి చూపించకుండా మీరు పరినిర్వాణం చెందరనే అనుకుంటున్నాను. ఆ అనుకోవడంవల్ల వచ్చిన సుఖం చేతనే బ్రతుకుతున్నాను."

బుద్ధుడు ఇట్లా సమాధానం ఇస్తాడు: "ఆనందా! నేను బాహ్యరికం లేకుండా, పక్షపాతం లేకుండా ధర్మాన్ని చెప్పాను. ఏమీ దాచలేదు. తథాగతుడు అట్లా దాచుకు చెప్పేటటువంటివాడు కాదు. సంఘం ఎవరిమీద ఆధారపడివుంది? నామీద ఆధారపడివుందని నేను అనుకోడంలేదు. అందువల్ల నేను చెప్పేది యేమివుంటుంది. నేను పెద్దవాణ్ణయిపోయాను. నిర్వాణాభిముఖంగా ధ్యానం మళ్ళిపోతున్నది. అందువల్ల మిమ్మల్ని మీరే దిద్దుకోవాలి. మీసంగతి మీరే చూచుకోవాలి. తథాగతుని శరీరం ఎంతకాలం నిలుస్తుంది."

వేలువగ్రామానికి సమీపంలో మహావనం అని వుంది. అందులో కూటాగారశాల అని బౌద్ధావసథం వుంది. బుద్ధుడు ఆనందుడితో గూడా అక్కడికెళ్లి భిక్షువుల్ని పిలిచి తాను చనిపోనున్న సంగతిని బహిరంగంగా ప్రకటించాడు. "హిన్ద దాని భిక్ఖవే ఆమంతయామి వో, వయధమ్మా సంఖారా, అప్పమాదేసంపాదే, నచిరం తథాగతస్స పరినిబ్బాణంభవిస్సతి, ఇతో తిణ్ణంమాసానం అచ్చయేనతథాగతో పరినిబ్బాయిస్సతీతి'."

ఈ మహావనంనుంచి బుద్ధుడు భండగ్రామానికి, అక్కడనుంచి పావాగ్రామానికి వెళ్ళాడు. ఈ పావాగ్రామంలో చుందుడికి, "కమ్మారపుత్తునికి" ఆమ్రవనం వుంది. ఆ వనంలో ఆయన విడిదిచేశాడు. చుందుని ఇంట్లో భిక్షను స్వీకరించాడు. ఆ భోజనం పడలేదు. రక్తవిరోచనాలు పట్టుకున్నాయి. కడుపునొప్పి బయలుదేరింది. అట్లాగే ఆయన కుసినారం చేరుకున్నాడు. అక్కడ మల్లుల సాలవనం చేరుకున్నాడు. ఇది హిరణ్యవతి నది ఒడ్డున ఉంది. ఆ వనంలో జోడుసాల వృక్షాలు ఉన్నాయి. వాటికి యమక సాలాలు అని పేరు. (సాల అంటే మద్ది చెట్టు) దానిక్రింద బుద్ధుడు ఆనందుని చేత పక్క వేయించుకున్నాడు. ఉత్తరం తలదిక్కుగా వేయించుకున్నాడు. కుడి పక్కగా తిరిగి పడుకున్నాడు. కాలుమీదకాలు పట్టుకుపడుకున్నాడు. ఎఱుకతో పడుకున్నాడు. నిగ్రహమూర్తియై పడుకున్నాడు. ఆ సాలవృక్షాలు అప్పుడు ఆ కాలంలో పువ్వులు పూసాయి. ఆ పువ్వులు ఆయనమీద రాలాయి. తథాగతుడికి ఆ రెండు చెట్లు పూజ చేస్తున్నట్లు అదిభాసించింది. అంతరిక్షంలో వుండి దేవతలు దివ్యములైన మందారపుష్పాలతో ఆయన్ను పూజించారు. చందనమార్గాలతో పూజించారు. తథాగతుని పూజకోసం దేవతలు అంతరిక్షంలో దివ్యసంగీతాలను పాడారు.

తథాగతుడు భిక్షువులను పిలిచాడు. వారికి తన చివరిమాటలు చెప్పారు. "బౌద్ధులు తమ జీవితంలో నాలుగు క్షేత్రాలను సేవించాలి. 1. తథాగతుడు పుట్టిన చోటు. 2. తథాగతుడు సంబుద్ధుఅయినచోటు. 3. తథాగతుడు ధర్మసామ్రాజ్యాన్ని స్థాపించినచోటు. 4. తథాగతుడు నిర్వాణం చెందినచోటు. ఈ నాలుగు మహాతీర్థాలు ఇవి: 1. లుంబినీవనం 2. బుద్ధగయ. 3. ఋషిపతనమృగదావం. 4. కుసినారం."

తథాగతుడు ప్రాణోత్క్రమణానికి పూర్వం భిక్షువులను పిలిచి యీ మాటలు చెప్పాడు: "వయ ధమ్మాసంఖారా, అప్పమాదేనమ్పాదేథా'తి" ఇవి ఆయన చివరిమాటలు. ఆ తర్వాత ప్రాణంపోయింది.

"సీలం సమాధిపఞ్ఞా చ  
విముత్తిచ అనుత్తరా  
అనుబుద్ధా ఇమే ధమ్మా  
గోతమేన యసిస్సినా॥

ఇతి బుద్ధో అభిఞ్ఞాయ  
ధమ్మం అక్ఖాసి భిక్ఖునం  
దుక్ఖ స్సంతకరో సత్థా  
చక్ఖుమా పరినిబ్బుతో". ★




రెండవ పంచవర్ష ప్రణాళిక మళ్లీ వార్తా పత్రికలలో ప్రాముఖ్యం వహించింది. ఇది తగునా తగదా, సాధించగలమా లేదా అనే ప్రశ్నలకంటె, చేసే ప్లానింగు నిర్దుష్టంగా చేద్దామనే శ్రద్ధకంటె, కేవలం ఎన్నికలలో విజయాన్ని దృష్టిలో పెట్టుకుని ఈ తంతు అంతా నడిపిస్తున్నట్లు కనబడుతోంది. ఇంత కొద్దిమందిచేత, ఇంత ఎక్కువమంది యిదివరకెన్నడూ ఋకౌయించబడలేదు.

ప్రణాళికను అమలుచేయడం అనేది అందు కవసరమైన ధన సాధన సంపత్తి దొరకడంమీద ఆధారపడి ఉంటుంది. ప్రణాళికకు ప్రభుత్వరంగంలో రు. 4,800 కోట్లు అయిదేళ్లమీద వ్యయం అవుతుంది. ఈ ధనాన్ని ఈ క్రింది విధంగా సేకరించాలని ఆలోచన:

| | కోట్లు |
|---|---|
| 1. ప్రస్తుతాదాయాలలో మిగులు | 800. |
| (ఎ) 1955-56 సం॥పు రివిన్యూ రేట్ల ప్రకారం | 350. |
| (బి) అదనపు పన్నులు | 450. |
| 2. ప్రజలనుండి ఋణాలు | 1200 |
| (ఎ) మార్కెట్ ఋణాలు | 700 |
| (బి) స్మాల్ సేవింగ్సు | 500 |
| 3. ఇతర బడ్జెటరీ ఆధారాలు | 400 |
| (ఎ) రైల్వేల నుండి | 150 |
| (బి) ప్రావిడెంటు ఫండు వెం॥ | 250. |
| 4. విదేశాల సహాయం | 800 |
| 5. లోటుపద్ధతి బడ్జెట్ | 1200 |
| 6. భర్తీచేయని లోటు | 400 |

పై పట్టికను జాగ్రత్తగా చూస్తే ప్రణాళికా నిర్వహణకు ప్రభుత్వపు జేబుల్లో రూ. 350 కోట్లు మాత్రమే ఉన్నాయనీ, ఈ 350 కోట్లు ఆధారంగా రూ. 4800 కోట్ల వ్యయాన్ని ప్రభుత్వం తలపెట్టిందని తెలుస్తుంది. అదనపు పన్నులు సేకరించడంగాని, ప్రజలవద్ద ఋణాలు చేయడంగాని, లోటుపద్ధతి బడ్జెటింగ్ గాని, ఇవి అన్నీ దేశంలో ఒకవిధమైన వాతావరణం ఉంటేగాని సాధ్యపడవు. అదనపు పన్నులకు సంబంధించినంతవరకూ, రాష్ట్ర ముఖ్యమంత్రులతో కూడిన జాతీయాభివృద్ధిమండలి తాము ఎంతెంత ధనం పన్నులరూపంలో వసూలు చేయవలసి ఉంటుందో తేల్చమని ఒత్తిడిచేస్తున్నారు. ప్రణాళిక రచనా సంఘంగాని, ఆర్థికశాఖగాని ఈ అదనపుపన్నుల విషయంలో వివిధ రాష్ట్రాల కోటాలను ఇంతవరకూ తేల్చిచెప్పలేదు. కొందరు ముఖ్యమంత్రులు తామిక సేకరించగలిగిందేమీ లేదని చెప్పేశారు. వసూలు చెయ్యగలిగినంత వసూలు చేయడం, ఆ తర్వాత అన్ని రాష్ట్రాలలో వసూలైన అదనపుపన్నుల ధనమంతా కలిపి ఒకనిధిగా చేసి ఏ రాష్ట్రానికెంత అవసరమో ఆరాష్ట్రానికంత ధనం కేటాయించడం మంచిదని వీరు సూచించారు.

*~~~~~~~~~~*

శ్రీ కృష్ణ
(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

మరికొందరు ముఖ్యమంత్రు లేమన్నారంటే, ఎన్నికలు రాబోతున్నాయి గనుక, ఇప్పుడు అదనపు పన్నులు విధించడం మంచిది కాదన్నారు. మొదటి పంచవర్ష ప్రణాళిక నిర్వహణపై ప్రణాళికాసంఘ నివేదికను చూస్తే, రాష్ట్రాలు తాము అదనంగా సేకరించవలసిన ధనాన్ని సేకరించలేకపోయాయని విశదమవుతున్నది.

ఇదంతా ఇలాఉంచి, ప్రభుత్వపు వివిధ శాఖలు కోరిన మొత్తాల ప్రస్తావన ఎవరూ తేవడం లేదు. ద్వితీయ ప్రణాళిక నిర్వహణకు ఇంకా రూ. 400 కోట్లు కావలసి వస్తాయని ఆర్థిక మంత్రి శ్రీ దేశ్‌ముఖ్ బహిరంగంగా ప్రకటించారు. రక్షణశాఖ అభివృద్ధికి మరో రూ. 400 కోట్లు కావలసి వస్తాయన్న సంగతి వెల్లడి అయిపోయింది. అంటే 1955-56 సం॥పు పన్నుల వసూళ్లవలన వస్తుందనుకున్న రూ. 350 కోట్ల మిగులు రాకపోగా రూ. 50 కోట్లు లోటు ఏర్పడుతోందన్నమాట. ఇక మౌలానా అబుల్‌కలాం అజాద్ గారి అధ్వర్యంలో ఉన్న రెండు శాఖలూ దేశానికి మరో నూర[illegible] కోట్ల రూ.ల వ్యయం అంటగట్టిన సంగ[illegible] కూడా రహస్యమేమీ కాదు. రాజ్యాం[illegible] విరుద్ధంగా ప్రభుత్వం ఉపాధ్యాయుల జీత[illegible]లకు సబ్సిడీగా ఇవ్వదలచిన రూ. 18 కోట్లు, నూనె గనుల అన్వేషణకు అయ్యే రూ. 3[illegible] కోట్లు, అస్సాం నూనె కంపెనీలో ప్రభుత్వపు వాటా రూ. 50 కోట్లు అవుతాయి.

వ్యవసాయోత్పత్తిని అధికం చేయాల[illegible] కార్యక్రమానికి మరో నూరుకోట్లు అదన[illegible] ఖర్చు తగులుతుంది.

భారీ పరిశ్రమలకు మరో [illegible] రూ. 55 కోట్లు కావాలని వ్యాపార, ప[illegible] శ్రమల శాఖామంత్రి శ్రీ టి. టి. కృష్ణమ[illegible]చారి కోరిక. రైల్వేశాఖ కావాలని కోరి[illegible] మొత్తం మంజూరు కానేలేదు. మద[illegible] నిషేధం అమలుజరిగే ప్రాంతం క్రమంగ[illegible] పెరుగుతున్నది. 'పంచశీల' సిద్ధాంతంలో మద్య నిషేధాన్ని కూడా భారత ప్రధా[illegible] క్రమంగా చేర్చేస్తున్నారు. దీనివల్ల రు. 3[illegible] కోట్లు నష్టం రాకతప్పదు. ప్రతి ఇంటి[illegible] అంబర్ చర్ఖా ఇచ్చే పద్ధతి (శ్రీ వినోబ[illegible] భావే చెప్పినదాన్నిబట్టి) వల్ల మరో రూ. 200 కోట్లు వ్యయం!

ఇవన్నీ ప్రణాళిక లెక్కల్లోకి రాలేద[illegible] ఏ పూటా ఆర్థిక పరిస్థితిని విలువకట్టే పద్ధతి ఆశ్రయించుకుని ప్రణాళిక తయారు చే[illegible] బడింది. అయిదేళ్లకీ భారత దేశానికి ఏమే[illegible] కావాలో పట్టిక వ్రాసి పంచవర్ష ప్రణా[illegible] అని పేరుపెట్టినట్లయింది. ప్రతి ఆర్థిక [illegible] వత్సరారంభంలోనూ లభ్యమయ్యే ఆ[illegible]యాలనుబట్టి ఈ ప్రణాళిక నెరవేరడ[illegible] నెరవేరకపోవడం ఆధారపడి ఉంటుందన[illegible] మాట. ప్రణాళిక నిర్వహణ ఏ పూటా లభ[illegible] మయ్యే ఆదాయాన్నిబట్టి ఉంటుంది; క[illegible] ఉద్యోగాలు మాత్రం అయిదేళ్లకీ ఒకసా[illegible] నిర్ణయింపబడతాయి! "ఓ భారత మహాజ[illegible] లారా! మీరు వచ్చే ఎన్నికలలో కాం[illegible] సుకే ఓట్లు వేస్తే లక్షలాది ఉద్యోగా[illegible] మీకు ఇప్పించగలము" ఇలా మన నా[illegible]

(56-వ పేజీ చూడండి)

# పుష్పాంజలి

## ౧

సమ్యక్సంబుద్ధ గౌతమ బుద్ధదేవుడు రాజగృహనగర సింహద్వారం దాటి పట్టణంలో ప్రవేశించినాడన్న వార్త చెవుల బడగానే పౌరులందరు తండోపతండాలుగా పుర సింహద్వారంవైపు సాగిపోయారు. శారీపుత్ర మౌద్గల్యాయనులు, ఇంకా ఇతర భిక్షుకులు నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ నిశ్శబ్దంగా బుద్ధదేవుని వెనువెంటనే వెళ్ళిపోయారు.

రాజగృహపుర ప్రాసాదాలలోను, రాజవీథులలోను, సామాన్య రథ్యలలోను ఎక్కడ చూచినా ఇసక వేసినా రాలని జనసందోహాలే! పౌరుల నేతలు, పిల్లలతోను, పాపలతోను తరలివచ్చి, బుద్ధదేవుని సందర్శనంకోసం బాటలపక్కనే పడిగాపులు పడి నిలుచున్నారు. వారంతా తమతమ దైనందిన సాంసారిక దుఃఖాలన్నీ విస్మరించి, ఆ దివ్యమూర్తి సందర్శనంకోసం అనుక్షణం తహతహలాడిపోతున్నారు.

అప్పుడప్పుడే అరుణోదయం అయింది. నగరంలోని సంపన్నగృహస్థు లనేకులు తథాగతుడు సాగివచ్చే మార్గాలలో ముత్యాల రంగవల్లులు దిద్ది తీర్చి, భక్తి వినమ్రముఖాలతో అనుక్షణము బుద్ధభగవానుని రాకకోసం ఎదురుతెన్నులు చూస్తున్నారు.

అరుణోదయకాంతులు ప్రసరించిన ముత్యాల రంగవల్లులన్నీ పద్మరాగ రంగవల్లులవలె మెరిసిపోతూ బుద్ధమూర్తి పాదపద్మాలకు స్వాగతమీయడంకోసం ఎదురుచూస్తున్నట్లుగా స్ఫురించాయి.

గౌతమబుద్ధదేవు డొక అరగడియకాలంలోనే బింబిసార చక్రవర్తి పుష్పోద్యానంవైపు విచ్చేయగలడనీ ఇక ఆలస్యంచేస్తే తన సంకల్పసమయం మించిపోగలదనీ ఆ ఉద్యానవనం తోటమాలి హృదయంలో ఒక అపూర్వమైన ఆరాటం చెలరేగింది. అంతవరకు అతనిలో ఆ సంకల్పమే ఉదయించలేదు. నగరంలో చిన్నపెద్దలంతా మహోత్సాహంతో జయజయధ్వానాలు చేస్తూ ఒళ్ళెరుగని ఆవేశంతో గౌతమదేవుని అడుగుజాడలో పడి నడిచివస్తున్నారు. వారిని చూచేసరికి తోటమాలికిక కాలు నిలవలేదు.

బింబిసార చక్రవర్తికోసం కోసిన బొండుమల్లె పూవులన్నీ ఒక పెద్ద పూలసజ్జలో నింపి ఆసజ్జ చేత ధరించి అలాగే నిరీక్షిస్తూ నిలుచుండిపోయాడు.

తోటమాలి ప్రతిదినము బింబిసార చక్రవర్తి కెనిమిది దంచాల బొండు మల్లెపూలు సమర్పిస్తూంటాడు. చక్రవర్తి దానికి ప్రతిఫలంగా అతనికి ఎనిమిది సువర్ణదీనారాల భృతి ఏర్పాటుచేయించాడు. ఆ భృతితో తోటమాలి, అతని భార్య, గంపెడు పిల్లలు ఏ లోటులేకుండా సుఖంగా కాలక్షేపం చేసుకుంటున్నారు.

తోటమాలి కానాటి పూవులన్నీ బుద్ధదేవుని కర్పించవలెనని ఆ క్షణంలోనే ఒక సంకల్పం కలిగింది. కాని చక్రవర్తి చండశాసనుడు! ఆయనకు సకాలంలో పుష్పాలర్పించకపోతే శిరశ్ఛేదనమో, నగరనిర్వాసనమో జరిగిపోతుంది. అందులో ఏమీ అనుమానం లేదు!

**పి. గణపతిశాస్త్రి**

అదంతా తలుచుకొనేసరికి తోటమాలికి దీనముఖాలతో విలపించే భార్య, గంపెడు పిల్లలు ప్రత్యక్షమైనారు. ఆపైని తోటలోని రంగురంగుల పూవులన్నీ పసిపాపల్లా కలకలలాడుతూ అతని కళ్ళకెదురుగా ప్రత్యక్షమైనాయి. ఆవేళ కోసిన మల్లెపూలన్నీ బుద్ధదేవుని కర్పించడమే జరిగితే అటుపిమ్మట తోటమాలి బ్రతుకంతా ఒక మహాశ్మశాన వాటికగా మారిపోతుంది. అది తలుచుకోగానే అతని కన్నులనుండి కన్నీరు మున్నీరుగా ప్రవహించింది.

అంతలోనే ఆ పుష్పోద్యానవన సమీపంలో కరతరంతరగా జయజయధ్వానాలు వినిపించాయి. పౌరుల కోలాహలం ఒక మహాసాగర కల్లోలంలా ప్రతిధ్వనించింది. ఇక ఆలస్యంచేస్తే తరుణం కాస్తా దాటిపోతుంది. వెంటనే తోటమాలి పూలసజ్జతో బుద్ధదేవుని పాదాలకభిముఖంగా నడిచిపోయాడు. తిరిగీ ఒకసారి వెనుదిరిగి చూచాడు.

దూరదూరంగా వటీరంలో అతనికి భార్య పిల్లలు కనిపించారు. వారంతా అతనివైపే చూస్తున్నారు. కాని వారెవరికీ అతని సంకల్పం తెలియదు. అమాయికంగా తనకోసం ఎదురుచూచే వారందరినీ చూడగానే తోటమాలికి తిరిగి కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. అయినా అతడేమీ చెక్కుచెదరలేదు. గుండె రాయిచేసుకొని బొండుమల్లెపూల పూలసజ్జతో తొందరతొందరగా గౌతమదేవుని పాదసన్నిధికి వెళ్ళిపోయాడు.

## ౨

ద్వాత్రింశన్మహాపురుష లక్షణాలతో బాలభానునివలె దేదీప్యమానముగా వెలిగిపోయే బుద్ధదేవుని సమీపించేసరికి తోటమాలి శరీరం అంతా ఒక్కసారిగా పులకరించింది. అతడొక్కసారిగా బుద్ధదేవుని అడుగులకు సాగిలపడి, లేచి నిలుచుని తిరిగీ సవినయంగా నమస్కరించాడు. ఒక దోసిలి పువ్వులు గౌతమదేవుని శిరస్సుపై వర్షించాడు. మరి ఒక రెండు దోసిళ్ళ బొండుమల్లెలతో ఆ దేవుని పాదాలపై అభిషేకించాడు. ఇంకో రెండు దోసిళ్ళ పూలు తథాగతుడు సాగిపోయే బాటమీద వెదజల్లాడు. ఇంకో రెండుదోసిళ్ళ మల్లెలాయన బుజాలపై విరజిమ్మాడు. మరిఒక దోసిలి మల్లెపూలు ఆ దేవుకి పుష్పాంజలిగా సమర్పించాడు. నిర్లిప్తదృష్టితో ప్రశాంతంగా సాగిపోయే తథాగతుడెంతో ఆప్యాయంగా తోటమాలి పూజలన్నీ అందుకొని తోడనే అతనిపై చిరునవ్వులు చిలకరించాడు. ఆ విధంగా ఎనిమిది దోసిళ్ళ మల్లెలతో తథాగతదేవునికి స్వయంగా పూజ లర్పించే మహాభాగ్యం కలిగింది గదా అని తోటమాలి హృదయంలో ఎంతైనా ఉప్పొంగిపోయాడు. అతని కనుగొలుకులనుండి ఆనందబాష్పాలవిరళధారగా ప్రవహించాయి.

తథాగతుడు కొంచెం ముందుకు సాగిపోగానే తోటమాలి మళ్ళీ ఇంటిముఖం పట్టాడు.

ఇంటి గుమ్మంముందు నిలిచి తోటమాలి చేసిన ఘనకార్యం అంతా కనిపెట్టి చూస్తున్న అతని భార్య భర్త గుమ్మంలో అడుగు పెట్టగానే అమాంతంగా అతనిమీద విరుచుకు పడింది.

"ఎంత పని చేశావీవేళ! చక్రవర్తి ఇక నీ ప్రాణాలు దక్కనిస్తారా? ఎవరో మహారాజులు జరిపించవలసిన పూజలు, పునస్కారాలు మనకెందుకయ్యా! ఇంక మల్లెతీగలలో ఒక్క మొగ్గయినా మిగలలేదు కదా?

**ప్రాచీన గాథాలహరి**

"మరి మనగలేం కాబోలు!" అని వలవలా వాపోయింది. అంతలోనే చక్రవర్తి పరిచారకు డక్కడికి వచ్చి చక్రవర్తికి సమర్పించే మల్లెపూలింకా రాలేదేమని గద్దించి అడిగాడు.

ఆ ప్రశ్నతో తోటమాలి భార్య చాలా భయపడింది. తన సంతానం అందరినీ వెంట ధ్యానములన్నీ పెట్టుకొని వెంటనే చక్రవర్తి పోయింది.

మొట్టమొదటగా ఆమెకు చక్రవర్తి దర్శనం లభించలేదు. పరిచారకులెవరు ఆమెను లోపలికి పోనీయలేదు. కాని ఆమె వలవలా ఏడుస్తూ అక్కడే కూర్చుండి పోయింది. పిల్లలంతా ఆమె పరిస్థితి చూచి, బెంబులే పడిపోయి అదేపనిగా గోల పెట్టడం మొదలుపెట్టారు! కొంతసేపటికి ఆ రోదన సన్నిధికి వెళ్లి చక్రవర్తి శయనాగారందాకా వెళ్లిపోయాయి. ఆయనకిక ఆమెకు దర్శన మివ్వక తప్పలేదు.

చక్రవర్తి దర్శనం దొరకగానే తోటమాలి భార్య తన విషాదగాథ అంతా ఆయన కీవిధంగా తెలియజేసింది. "మహాప్రభూ! నా భర్త వట్టి అమాయకుడు! చాదస్తుడు. తన పూలమొక్కలు, పూలు తప్ప మరి వేరే ప్రపంచం ఏమీ ఎరగడు! జనం అంతా కేకలు వేసుకుంటూ ఆ సన్యాసిమహారాజా వెంటబడేసరికి మీకోసం కోసినపూవులన్నీ తీసుకుపోయి ఆయన పాదాలమీద కుమ్మరించాడు. చక్రవర్తి కివ్వవలసిన పువ్వులు సన్యాసికిస్తే మన ప్రాణాలెగిరిపోతాయనీ, ఆపువ్వు లలా పారబోయ్యవద్దనీ నేను కేకలు వేసుతూనే ఉన్నాను! అయితే ఆ వెర్రి బాగులవాడు నా మాటలు వినిపించుకుంటేనా? ఆ కోసిన పువ్వులు కాసినీ ఆ సన్యాసిమహారాజా పాదాలమీద దిమ్మరించివచ్చాడు. నేనేం చెయ్యను బాబూ!"

చక్రవర్తికీ గాథ వినేసరికి కొంచెం నవ్వే వచ్చింది! అయినా బింబిసారు డది పైకి వ్యక్తం కానీయలేదు. కొంచెం రుసరుస లాడుతూ ఆమెతో ఇలాగన్నాడు:

"ఆఁ! తోటమాలికంతటి పొగరా? చక్రవర్తి కీయవలసిన పుష్పాలు సన్యాసి పాదాలమీద కుమ్మరిస్తాడా? వాడిసంగతి నేను కనుక్కుంటానులే! సరే నీకు, నీ పిల్లలకు భయమేమీ లేదులే! ఇంటికి వెళ్లిపో!"

ఆ మాటలు వినేసరికి ఆమెకు కొంత ఊరట కలిగింది గాని తన భర్త కేదో కీడు మూడనున్నదని భయపడింది. తిరిగీ చక్రవర్తి కెదురుగా మోకరిల్లి "నాభర్త ఏమి ఎరగని వట్టి వెర్రిబాగులవాడు బాబూ! ప్రభువువారేలాగైనా కటాక్షించి రక్షించాలి!" అని విన్నవించి తొందరతొందరగా ఇంటికి వెళ్లి పోయింది. చక్రవర్తి సన్నిధికి వెళ్లి ప్రాణ



హైదరాబాదు రాష్ట్రంలోని అజంతాగుహలు శిల్ప, చిత్రలేఖనకళలకు ప్రపంచ ప్రసిద్ధిగాంచినవి. ఇది ఒక గుహ అంతర్భాగ దృశ్యం.

## ★ పుష్పాంజలి ★

భిక్ష పెట్టవలసిందని ప్రతిమాలుకొమ్మని తోటమాలితో చెప్పింది. తోటమాలి చక్రవర్తికీ, ఆమెకు మధ్యన నడిచిన సంభాషణ అంతా విన్నాడు. ఇక చక్రవర్తి సన్నిధికి వెళ్లడంవల్ల లాభం లేదని నిశ్చయించుకొన్నాడు. ధైర్యంగా ఇలా గన్నాడు. "కోటన్నిటికీ తెగించే ఆ మహారాజుకు పాదపూజ చేసుకున్నాను. నా పూజలందుకుని ఆ మహానుభావు డెంతో ఆనందించారు! ప్రజలంతా బాగుబాగని హర్షించి తలలూచారు! నాకదే పదివేలు! ఇక ఈ పాడుబ్రదుకు కమైపోతే చాలేమి!"

అని నిర్లక్ష్యంగా అడుగులు వేసుకుంటూ అక్కడినుంచి వెళిపోయాడు "అయ్యో! నాప్రాణమగడా! నిజంగానే నీకు మతి పోయిందయ్యా!" అని అతనిభార్య అదే పనిగా వాపోయింది.

### 3

ఆనాటి సాయంకాలం బింబిసారచక్రవర్తి రాజభవనానికి విచ్చేసితన ఆతిథ్యం స్వీకరించవలసిందని సవినయంగా బుద్ధదేవుని విన్నవించాడు. కాని కరుణామూర్తి గౌతమ బుద్ధుడు దాని కంగీకరించలేదు! రాజభవనంలో పౌరులెవ్వరికీ తన దర్శనం లభించదనీ అందువలన వారందరికీ అందుబాటులో ఉండే విశాలప్రదేశంలో ఆతిథ్యసన్నాహాలు చేయించవలసిందనీ ఆదేశించాడు. బింబిసార చక్రవర్తి ఆ ఆదేశం శిరసావహించాడు. తథాగతుడు భిక్షుభిక్షుకీగణాలతో కలిసి రాజగృహ నగర పుష్పోద్యానవనానికి విచ్చేశాడు. ఆనాడు రాజగృహ పౌరులందరూ తండోపతండాలుగా ఆ పుష్పోద్యానవనంలో గుమిగూడారు. పుష్పోద్యానవనంలో చల్లగాలికి కదలాడే పూలచెట్లన్నీ అపార కారుణ్యనిధియైన గౌతమదేవునిపై పూల వానల జల్లులు కురిపించాయి! ఉద్యానవనంలో నెమళ్లన్నీ పురివిప్పి నృత్యం చేశాయి. ఆనాడు పౌరులందరు చేతులు జోడించి సమ్యక్సం బుద్ధ శాక్యసింహానికి జేజేలర్పించి ధన్యులైనారు. ఉద్యానవనం అంతా ఆనంద వెలుగులో అప్పుడే కొత్తగా చిగిర్చినట్లుగా మెరిసిపోయింది!

కాని తోటమాలిభార్యమాత్రం ఒక చెట్టుకింద కూలబడి బుద్ధదేవుని పాదాలు మనసారా సంస్మరించుకొని తనలో తానే గొణుక్కొంటున్నది. తన భర్త ఏమీయెరగని వట్టి వెర్రిబాగుల వాడనీ అతనికి విధింపబోయే దారుణ మరణశిక్ష తప్పించవలసిందనీ పరిపరివిధాలుగా బుద్ధభగవానుని ప్రార్థించింది. అప్పుడప్పుడు నిశ్చలంగా జనసందోహంవైపు తిలకిస్తున్న బుద్ధదేవుని కృపావిశాలనేత్రాలవైపు చూచింది. ఆమెకవి తనవైపే తిలకిస్తున్నట్లుగా స్ఫురించాయి. ఆమె తన సంతానానికి రాబోయే దైన్యస్థితి తలుచుకొని తిరిగీ కన్నీరు పెట్టుకొన్నది. ఆ కృపామూర్తి తన ప్రార్థన వినకపోడని అనుకొని కొంచెం ధైర్యం పొందింది. ఆయనకు తమవంటివారి కోరికలు తెలియకపోతాయా! అని కొంచెం ఊరట చెందింది.

బింబిసార చక్రవర్తి బుద్ధదేవునికి, భిక్షుభిక్షుకీగణాలకు చేసిన పాదపూజ ముగిసిపోగానే పౌరులందరు తిరిగీ తమతమ గృహాలకు

(53-వ పేజీ చూడండి)

# బౌద్ధతత్త్వ సిద్ధాంతాలు

బౌద్ధమతస్థాపకుడైన గౌతమ బుద్ధుడు ప్రధానంగా ధర్మోపదేశకుడేగాని, తత్వశాస్త్రవేత్త కాడు. ఈ లోకములో మానవుని బాధల నంతరింపజేయడానికి మార్గం సూచించాడే గాని పరలోకాన్ని గూర్చి, పరతత్వాన్ని గూర్చి విచారణ చెయ్యలేదు. అందుచేత ఆయన్ని ఆధునిక పరిభాషప్రకారం తత్త్వశాస్త్రవేత్త అన డానికి వీలులేదు.

అయినప్పటికీ బౌద్ధమతం భారతదేశంలో వర్ధిల్లిన సుమారు వెయ్యి సంవత్సరాలలో మిగతా అన్నిమతాలకులాగానే బౌద్ధ మతానికికూడా పరతత్వ విచారణ అవసర మయింది. ఆ మతంచుట్టూ అనంతమైన తత్త్వశాస్త్రం, అనేక విశ్వాసాలు పెరిగాయి. ఈ తత్త్వశాస్త్రం, విశ్వాసాలు బౌద్ధం విస్తరించిన ఒక్కొక్కదేశంలో ఒక్కొక్కరీతిగా రూపు దాల్చాయి. ఆ మతస్థులు అనేక శాఖోపశాఖలుగా చీలిపోయారు. ఈ చారిత్రికపరిణామం ఎంత చిత్రంగా జరిగిందంటే 2500 ఏళ్ల క్రిందట బుద్ధుడుపదేశించిన నిర్వాణమార్గానికీ, ఈనాడు ఆసియా దేశాలలో అనుసరింపబడే మార్గానికీ, విశ్వాసాలకీ చాలవరకు పోలికే కనిపించదు. గౌతమ బుద్ధుడనే చారిత్రిక పురుషుణ్ని కూడా అచ్ఛాదించివేసేటంత దట్టంగా మత విశ్వాసాలు పెరిగిపోయాయి.

ఈ పరిస్థితిలో అసలు గౌతముడు ఉపదేశించిన ధర్మం ఏమిటి, అది ఏ రకంగా తుదకు పరిణమించింది, అనే విషయాలు సంగ్రహంగానయినా తెలుసుకోవడం అవసరం.

సిద్ధార్థుడు యౌవనంలో సకల భోగ భాగ్యాలు అనుభవిస్తున్న సమయంలోనే, ఆయనకు ప్రపంచంలో జరామరణవ్యాధియుతమైన దుఃఖం గోచరించింది. స్త్రీ పురుషు లెవ్వరూ ఆయనకు కనబడలేదు. ఈ దుఃఖం ఏమిటి, దీనికి నివృత్తిమార్గం ఏమిటి అనే ప్రశ్నలు ఆయనను జిజ్ఞాసువుగా చేశాయి. వజ్ర సంకల్పంతో ఆయన తదన్వేషణకు ఉపక్రమించాడు. తుదకాయన కనుగొన్న సత్యమే బౌద్ధమతానికి బీజప్రాయమై నిలిచింది. ఆ బీజంలోంచి వెలువడిన మహావృక్షశాఖలు దక్షిణాన సింహళం, బర్మా, సయాం, ఉత్తరాన టిబెట్, చైనా జపాన్ దేశాలవరకూ వ్యాపించి ధర్మసౌరభం నలుదిక్కులా వెదజల్లాయి.

## "చత్వారి ఆర్య సత్యాని"

బుద్ధుడు నాలు సత్యాలు కనుగొన్నాడు. వీటిలో మొదటిది 'జగత్తు దుఃఖమయం' అని. దుఃఖమంటే జర, మరణం, వ్యాధి—ఇవే కాదు. మానవజీవితం యావత్తూ దుఃఖమయమే. తాత్కాలికంగా సుఖం అనుభవిస్తున్నామని భ్రమించినా, సుఖం కూడా కడకు దుఃఖమే కలిగిస్తుంది. ఎందుచేతనంటే సుఖం అశాశ్వత మయినది. దాని అశాశ్వతత్వాన్ని గూర్చిన ఆందోళన మానవునకు తప్పదు. కనుక దుఃఖం కానిదేదీ లేదు.

ఇక రెండో సత్యం ఈ దుఃఖానికి కారణం ఉన్నదని. ప్రతి సంఘటనకూ కారణం ఉంటుందనీ, కారణంలేనిదే ఏ కార్యమూ లేదనీ బుద్ధుడు కనుగొన్నాడు. ఈ సూత్రాన్ని అనుసరించి దుఃఖానికికూడా కారణం ఉండిఉండాలి. (1) జరామరణాదికమైన బాధలన్నిటికీ (2) జన్మమే కారణం. (3) జన్మకు కారణం జన్మించాలనేభావం. (4) ఈ భావానికి ఉపాదానం, అనగా ప్రాపంచికవస్తువులను మానసికంగా అంటిపెట్టుకునిఉండడం కారణం. (5) దీనికి కారణం ఇంద్రియసుఖా లనుభవించాలనే తృష్ణ. తృష్ణ ఎక్కడినించివస్తోంది? ఇంద్రియ సుఖాల నదివరకే రుచిమూసి ఉండకపోతే తృష్ణ కలగదు. (6) కనుక ఇంద్రియానుభవం,



బుద్ధుడు మొదటిసారిగా ధర్మచక్ర పరివర్తనం చేస్తున్నదృశ్యం.
(గాంధార శిల్పం)

# ★ బౌద్ధతత్వ సిద్ధాంతాలు ★

లేక వేదనతృష్ణకు కారణం. (7) ఇంద్రియాలు వస్తువులను స్పృశించకపోతే వేదన లేదు. కనుక ఈ 'స్పర్శ' వేదనకు కారణం. (8) స్పర్శకు కారణం పంచేంద్రియాలు, మనస్సు. (9) ఈ పంచేంద్రియాలకు, మనస్సుకు నామరూపాత్మకమైన మానవదేహం కారణం. (10) ఈ మానవదేహం ప్రాణరహితమైనా, చైతన్యరహితమైనా జన్మించదు. (11) ఈ చైతన్యం అనేది మన పూర్వజన్మసంస్కారాలవలన కలుగుతోంది. 12 ఈ సంస్కారాలకు కారణం అవిద్య. కనుక అవిద్యయే దుఃఖానికి మూలకారణం అవుతున్నది. ఇలాగ పన్నెండు అంచెలమీద బుద్ధుడు దుఃఖమూలకారణాన్ని వ్యక్తం చేశాడు. దీన్నే బౌద్ధులు ద్వాదశ నిదానాలు అంటారు.

బుద్ధుడు కనుగొన్న మూడవసత్యం దుఃఖాన్ని నిరోధించవచ్చునని. దుఃఖానికి కారణం ఉన్నదని ఎప్పుడైతే కనుక్కున్నామో, అప్పుడే ఆ కారణం తొలగిస్తే దుఃఖం నశిస్తుందని విదితమవుతున్నది. దుఃఖాన్ని ఈ జన్మలోనే నిరోధించవచ్చునని బుద్ధుడు ప్రతిపాదించాడు. రాగద్వేషాలను జయించినవానికి ప్రాపంచికబంధాలన్నీ నశిస్తాయి. అతడు బంధవిముక్తుడవుతాడు. అర్హతుడవుతాడు. ఆ స్థితినే నిర్వాణం అంటారు.

ఇక నాలుగో సత్యం దుఃఖ నిరోధానికి మార్గం ఉన్నదని. బుద్ధ ప్రతిపాదితమైన ఈ మార్గం ఎనిమిది విధాలుగా ఉన్నది. దీనినే అష్టాంగికమార్గం అంటారు.

బుద్ధుని అష్టవిధమార్గం ఇది: (1) సమ్యగ్ దృష్టి:- దుఃఖాన్ని గూర్చి బుద్ధుడు చెప్పిన నాలుగు ఆర్య సత్యాలను గూర్చి సరియైన జ్ఞానం కలిగి ఉండడం.

(2) సమ్యక్ సంకల్పము:- సమ్యగ్ దృష్టి మాత్రమే ఉన్నందువల్ల లాభం లేదు. ప్రాపంచిక వ్యామోహాన్ని విసర్జించాలి. ఇతరులపై ద్వేషం తొలగించుకుని, ఎవరికీ హాని కలగకుండా ప్రవర్తించాలి.

(3) సమ్యగ్ వాక్:- అబద్ధ మాడటం, అపనిందలు వేయడం, పరుషంగా మాట్లాడటం, హేళనగా మాట్లాడడం మాని వేయ్యటం వలన సమ్యగ్ వాక్కు అలవడుతుంది.

(4) సమ్యక్ కర్మ:- ప్రాణిహింస, చౌర్యం, ఇంద్రియలౌల్యం విసర్జించడం సరియైన ప్రవర్తన అవుతుంది.

(5) సమ్యగాజీవము:- ఋజుమార్గంలోనే జీవనోపాధి గడించుకోవాలిగాని అక్రమపద్ధతు లవలంబించరాదు.

(6) సమ్యగ్ వ్యాయామం:- మనస్సులో పాతుకుపోయిన దురాలోచనలను పెకలించి వేయడానికి, కొత్తగా దురాలోచనలు మనస్సులో ప్రవేశించకుండా చెయ్యడానికి ప్రతిక్షణమూ ప్రయత్నిస్తూ ఉండాలి. మనస్సును శూన్యంగా ఉంచడం సాధ్యం కాదు గనుక, సదాలోచనలతో మనస్సును నింపడానికి అది తొలగిపోకుండా ఉండడానికి తీవ్రయత్నం చేస్తూ ఉండాలి.

(7) సమ్యక్ స్మృతి:- దేహము, ఇంద్రియాలు, మనస్సు మొదలైనవానియొక్క అశాశ్వతత్వాన్ని సదా జ్ఞాపకంలో ఉంచుకోవాలి. అలా జ్ఞాపకం ఉంచుకోకపోతే అవి శాశ్వతమని భావించడం, వాటిపై వ్యామోహం పెరగడం, తత్ఫలితంగా దుఃఖం సంభవించడం జరుగుతుంది.

(8) సమ్యక్ సమాధి:- పై ఏడు నియమాలను అనుసరించిన వ్యక్తి అన్ని కోరికల నుండి, చెడ్డ తలపులనుండి విముక్తుడై సమ్యక్ సమాధిలో ప్రవేశించగలుగుతాడు. ఆ స్థితిలో అతడు సుఖదుఃఖాతీతము, నిర్వికారమూ, దుఃఖరహితమూ అయిన నిర్వాణపదం పొందుతాడు.



## అనాత్మవాదం

బుద్ధుని ఉపదేశాలలో కొన్ని తాత్విక సిద్ధాంతాలు మిళితమై లేకపోలేదు. కారణం లేనిదే కార్యం లేదనే సిద్ధాంతం ఒకటి. దీనినే ప్రతీత్యసముత్పాదమని బుద్ధుడు నిర్వచించాడు. ఈ కార్యకారణ సూత్రంవల్లనే దుఃఖ కారణాన్ని, దుఃఖ నిరోధ మార్గాన్ని కూడా కనుగొనడానికి వీలైనది. బుద్ధుని సిద్ధాంతాల్లో మరొకటి కర్మసిద్ధాంతం. పూర్వజన్మకర్మవల్లనే ప్రస్తుత జన్మ కలిగిందని, ప్రస్తుత జన్మ ఉత్తరజన్మకు కారణమవుతుందనే ఈ సిద్ధాంతం పైన చెప్పిన ప్రతీత్యసముత్పాదసిద్ధాంతంమీద ఆధారపడినది. ఈ సిద్ధాంతంమీద ఆధారపడినదే జగత్తు అనిత్యమూ, ప్రతిదానికీ ఆది ఉన్నట్టే, అంతం కూడా ఉన్నది అనే సిద్ధాంతం. దీన్ని అనుసరించే బుద్ధుడు ఆత్మ అనేది లేదనికూడా ప్రతిపాదించాడు. ఆత్మ అంటే మార్పు లేనిది, ఆద్యంతాలు లేనిది కనుక, ఆద్యంతాలు లేని దేదీ లేదు కనుక ఆత్మ లేదని ఈ సిద్ధాంతం. ఆత్మ లేదని బుద్ధుడు చెప్పినప్పటికీ, జన్మ పరంపరను ఒప్పుకున్నాడు. ఇదెలా సంభవమైంది? జీవితం అనేది అనంత భిన్న భిన్న స్థితుల సముదాయం. ఒకస్థితి మరొకస్థితికి కారణమవుతుంది. ఆస్థితి ఇంకొక స్థితికి కారణమవుతుంది. ఈరీతిగా అనేక స్థితుల ద్వారా జీవితం కొనసాగుతుంది. ఒక దివ్వె నుండి మరొక దివ్వె వెలిగినట్టుగా, ఒకజన్మయొక్క అంత్యస్థితినుండి తద్భిన్నమైన మరొక జన్మయొక్క ప్రారంభస్థితి సిద్ధిస్తుంది. అంటే బుద్ధుడు ఆత్మను తొలగించి దాని స్థానంలో అవిచ్ఛిన్నమైన చైతన్య ప్రవంతిని ప్రవేశపెట్టాడన్నమాట. ప్రస్తుత చైతన్యస్థితిలో పూర్వ చైతన్యస్థితి నిక్షిప్తమై ఉంటుంది గనుక గతంలోని కర్మఫలితాలన్నీ వర్తమానాన్ని కూడా బాధిస్తాయి. ఆత్మను బుద్ధుడు హేళన చేస్తూ, ఆత్మను ప్రేమించడం లోకంలో ఎవరికీ తెలియని, ఎవరూ చూడని సుందరిని ప్రేమించడంలాంటిదని అన్నాడు. ఆత్మను గూర్చి ఆలోచించడం కూడా అవివేకం అన్నాడు. దుఃఖ నివారణం ఒక్కటే మానవుని కర్తవ్యం. విషబాణం తగిలి బాధపడుతున్నవాడు, బాణాన్ని లాగివేయడానికి ప్రయత్నించక, బాణం ఎలా వచ్చింది, దాన్ని తయారుచేసినదెవరు, ప్రయోగించినదెవరు మొదలైన ప్రశ్నలతో కాలాన్ని వృథా చేయడం ఎంత హాస్యాస్పదమో దుఃఖనివృత్తిమార్గం ఆలోచించకుండా, ఆత్మను ధ్యానించడం అంత హాస్యాస్పదం అని బుద్ధుడన్నాడు.

"దుఃఖము, దుఃఖనిరోధము" ఇదే నేనిదివరలో చెప్పింది, ఇప్పుడు చెబుతున్నది," అని బుద్ధుడు అన్నాడు. దుఃఖకారణం కనుక్కోవడం, ఆకారణం తొలగించివేయడానికి అష్టాంగికమార్గం అనుసరించడం అనే రెండింటిమీద ప్రాచీన బౌద్ధధర్మం ప్రవర్తిల్లింది.

## బౌద్ధతత్వ శాఖలు

అయితే కాలక్రమేణ బౌద్ధమతం అనేక దేశాలకు విస్తరించింది. ఆ మతం అనేక ఇతర మతాలను, ఇతర మతతత్వవేత్తల విమర్శలను ఎదుర్కొనవలసి వచ్చింది. బౌద్ధధర్మాన్ని ఆ విమర్శలనుండి రక్షించుకోవడం

కోసం వారెదు సిద్ధాంత రాద్ధాంతాలు చేయవలసివచ్చింది. ఈ సిద్ధాంతాలన్నిటికీ బుద్ధుని ఉపదేశాలలోనే బీజాలు కనబడడం చేత సులభంగా అభివృద్ధిపొందడానికి తగిన అవకాశం లభించింది. ఈరీతిగా సుమారు 80 వేర్వేరువాదాలు, ఇంకా ఎన్నో చిల్లర ఉపవాదాలు బౌద్ధంలోనే అంకురించి విస్తరించాయి. వీటిలో ముఖ్యమైన కొన్ని వాదాలను ఇక్కడ స్పృశించుదాం.

## మాధ్యమికవాదం

క్రీ. శ. రెండవ శతాబ్దంలో ఆంధ్రదేశములో శాతవాహనుల పతాకచ్ఛాయను నివసించిన నాగార్జునాచార్యుడు మాధ్యమిక వాదానికి ఆరంభకుడని చరిత్రకారులు పేర్కొంటున్నారు. బుద్ధచరిత్ర కావ్యం రచించిన అశ్వఘోషుడు ఈవాదానికి బీజం నాటిన తత్త్వవేత్త అని కొందరు చెబుతారు. ఏమైనా మాధ్యమికవాదం నాగార్జుని రచనలలో, ముఖ్యంగా మాధ్యమిక కారికలనే గ్రంథంలో స్పష్టంగా రూపు దాల్చి ఉండడంచేత ఆయనే ప్రతిపాదించాడని చెప్పవచ్చును. ఈ వాదానికి శూన్యవాదం అనే నామాంతరంకూడా ఉన్నది. శూన్యవాదం అనే పేరు ఉండటంచేత "అంతా శూన్యం" అని ఈవాదం చెబుతుందని పలువురు వ్యాఖ్యానించారు. అసలు సత్యం అనేదే లేదని ఈవాదం చెప్పదు. ఇంద్రియగోచరమైన జగత్తు మాత్రమే శూన్యమని, ఈ జగత్తుకు అతీతమైన సత్యం ఉన్నదని, ఆ సత్యాన్ని విజ్ఞానమయమనిగాని, కాదనిగాని ఏ రీతిగాను వర్ణించడానికి వీలులేదని, ఆ అనిర్వచనీయ సత్యాన్ని ఇదమిత్థమని చెప్పలేము గనుక దాన్ని శూన్యం అని అనవచ్చుననీ యీ వాదంలోని అంతరార్థం. సత్యపదార్థము కార్యకారణ సిద్ధాంతబాధితమైనది కాకూడదు. కాని, కార్యకారణబాధితం కానిదేదీ లేదు. కనుక అది సత్యము కానేరదు. అయితే అది అసత్యమనడానికి కూడా వీలులేదు. అసత్యమైనది గాలిలో మేడవలె ఉండడమే సంభవించదు. అది సత్యమూ కాదు, అసత్యమూ కాదు. అయితే అది ఏమిటి అనే ప్రశ్నకు సమాధానంగా శూన్యం అని చెప్పవలసివస్తుంది. వస్తుజగత్తుయొక్క నిజస్వభావం వర్ణించడానికి వీలులేనిది కనుక శూన్యత అనిచెప్పి తృప్తిపడవలసివస్తుంది. అంటే వస్తుస్వభావము 'సత్యము లేక అసత్యమనిగాని', 'సత్యమూ, అసత్యము కూడా ననిగాని', 'సత్యమూ కాదు, అసత్యమూ కాదనిగాని' చెప్పడానికి వీలు లేదు.

సత్యం రెండువిధాలైనదని మాధ్యమికులంటారు. ఒకటి సంవృతి సత్యం. ఇది సామాన్యప్రజలకు ఉద్దేశించినది. జగత్తుయొక్క అశాశ్వతత్వాన్నిగూర్చి, కార్యకారణ సిద్ధాంతాన్నిగూర్చి బుద్ధుడు చెప్పినది లౌకికసత్యంమాత్రమే. కాని పరమార్థసత్యం వేరే ఉన్నది. జగత్తుయొక్క నిజస్వభావం తెలుసుకుని నిర్వాణపదం పొందిన అర్హతునికి ఈ సత్యం వర్తిస్తుంది. ఈ నిర్వాణం లౌకికంగా తెలియబడనిది, తర్కంగా అర్థించబడనిది, నాశనంలేనిది, నిత్యం కానిది, అంచనావేయడానికి వీలులేనిది, జననంలేనిది" అని మాత్రమే నాగార్జునుడు వర్ణించాడు.

ఈ మాధ్యమికవాదానికి, గౌడపాద, శంకరాచార్యుల అద్వైతవేదాంతానికి దగ్గరి పోలికలు చాలా కనిపిస్తున్నాయి.



నలందా విశ్వవిద్యాలయ శిథిలాలు: ప్రాచీనకాలంలో ఇది గొప్ప అంతర్జాతీయ విద్యా కేంద్రంగా ఉండేది. దేశదేశాలనుండి వచ్చిన పదివేలమంది విద్యార్థులు, ఆచార్యులు ఇక్కడ ఎల్లప్పుడూ నివసించేవారు. ఏడుశతాబ్దాలపాటు వర్ధిల్లిన ఈ కేంద్రం బీహారులో ఉన్నది.

## విజ్ఞానవాదం

మాధ్యమికులవలెనే, బాహ్యజగత్తు శూన్యం అని చెబుతూ మనస్సు లేక చిత్తము మాత్రం సత్యమైనదని విజ్ఞానవాదులు అంటారు. మనస్సుకూడా అసత్యమైతే మన ఆలోచన, వితర్కము కూడా అసత్యమైపోతాయి. అప్పుడు మాధ్యమిక వాదులు తమ వాదం సరియైనదో కాదో కూడా చెప్పలేని అవస్థలో పడతారు. కనుక అంతా అసత్యం అనే వాదం ప్రమాదకరమైనది. మనస్సు సత్యమేనని ఒప్పుకుంటేగాని మనం సిద్ధాంతీకరించినది సత్యమని చెప్పలేము.

మనస్సు ఒక్కటే సత్యమనే సిద్ధాంతాన్ని అనుసరించి, మనకు గోచరించినట్లు కనబడే బాహ్యజగత్తు యావత్తూ మన భావనే గాని నిజంగా లేదని విజ్ఞానవాదులు అంటారు. స్వప్నంలో మనం అనేక వస్తువులను మనకు వెలుపల ఉన్నట్లు భ్రమపడతాము. అవన్నీ మన భావనలేగాని నిజంగా లేనట్లే బాహ్యజగత్తు కూడా మన భావనా రూపమే. ఏ బాహ్యవస్తువూ నిజంగా ఉన్నదని మనం నిరూపించలేము. ఎందుకంటే



# ★ బౌద్ధతత్త్వ సిద్ధాంతాలు ★

బాహ్యవస్తువు, దాన్ని గూర్చిన మన జ్ఞానం వేరుకావు. ఆ రెండూ ఒకటే అయినా, దృష్టిదోషం ఉన్నవాడికి ఇద్దరు చంద్రులు కనిపించినట్లే సమ్యగ్దృష్టి లేనివానికి వేరు వేరుగా కనిపిస్తాయి.

అయితే బాహ్య వస్తువులన్నిటినీ మనస్సే సృజిస్తున్నప్పుడు మనస్సు తనకు కావలసిన వాటినే ఇష్టంవచ్చినప్పుడల్లా ఎందుకు సృజించుకోలేదు? దీనికి విజ్ఞానవాదులిలా అంటారు. మనస్సులోని చైతన్య ప్రవంతిలో అనేక పూర్వకర్మ సంస్కారాలన్నీ నిక్షిప్తమై ఉంటాయి. ఒక్కొక్క క్షణంలో ఒక్కొక్క సంస్కారమే పైకివచ్చి, పరిపాకం పొంది విజ్ఞానంగా పరిణమిస్తుంది. అందుచేత ఆ క్షణంలో ఆ సంస్కారానికి అనుకూలమైన వస్తుజ్ఞానమాత్రమే లభిస్తుంది. మనస్సులో అనేక గత విషయాలు నిక్షిప్తమై ఉన్నా ఒక్కొక్క క్షణంలో ఒక్కొక్క విషయం మాత్రమే జ్ఞాపకం వచ్చినట్లు, ఒక్కొక్క క్షణంలో ఒక్కొక్క సంస్కారం మాత్రమే పరిపాకంచెంది వస్తుజ్ఞానంగా భాసిస్తుంది. గాని ఏది పడితే అది కాదు. గత సంస్కారాలన్నిటినీ నిక్షిప్తం చేసుకున్న చిత్తాన్ని విజ్ఞానవాదులు 'ఆలయ విజ్ఞానం' అంటారు. సాధనద్వారా, నిగ్రహంద్వారా ఆలయ విజ్ఞానాన్ని స్వాధీనం చేసుకుని అవాంఛనీయ సంస్కారాలన్నిటినీ నశింపజేసి, నిర్వాణ సంధాయకమైన మానస్థితిని పొందవచ్చునని విజ్ఞానవాదుల మతం.

వీరు యోగసాధనద్వారా ఆలయ విజ్ఞాన సత్యం గుర్తింపవచ్చునని విశ్వసిస్తారు. కనుక వీరిని యోగాచారులని కూడా అంటారు.

## సౌత్రాంతిక వాదం

సౌత్రాంతికవాదులు మనస్సు ఒకటే కాక బాహ్యజగత్తుకూడా సత్యమేనని విశ్వసిస్తారు. బాహ్యవస్తు స్థితిని ఒప్పుకోకపోతే అది మిథ్యారూపంలోనైనా గోచరమవడానికి ఆస్కారంలేదని వీరి వాదం. మన మనోభావమే బాహ్యవస్తువుగా కనిపిస్తోందనడం వంధ్యా పుత్రవాదం వంటిదే. అదీగాక ఒక ఘటం (కుండ) చూసినప్పుడు ఘటం బాహ్యవస్తువుగాను, దానిని గూర్చిన జ్ఞానం అంతరమైనదిగాను కనిపిస్తుంది. అందుచేత వస్తువు వేరు, వస్తుజ్ఞానము వేరు. రెండూ ఒకటే అయితే 'నేనే ఘటాన్ని' అనాల్సివస్తుంది. అన్నీ మనోజన్యాలే అయితే ఘటాన్ని చూసినప్పుడు ఘటం అనీ, పటం (వస్త్రం) చూసినప్పుడు పటం అనీ వేరుగా చెప్పడానికి వీల్లేకపోతుంది.

బాహ్యజగత్తు నిజంగా ఉన్నప్పటికీ, మనకు గోచరమయ్యేది అదికాదనీ, దానియొక్క ప్రతిబింబం మన మనస్సులో పడి తద్వారా ఒక వస్తువుయొక్క ఉనికిని మనం తెలుసుకోగలుగుతున్నామని, అసలు వస్తువే లేకపోతే దాని ప్రతిబింబం ప్రశ్నే లేదనీకూడా వీరు విశ్వసిస్తారు. అందుచేత వీరిని బాహ్యానుమేయవాదులని కూడా అంటారు. వీరి సిద్ధాంతాలకు సూత్రపిటకం ఆధారంగా తీసుకుంటారు గనుక వీరికి సౌత్రాంతికవాదులని పేరు వచ్చింది.

## వైభాషిక వాదులు

బాహ్యాంతర జగత్తులు రెండూ సత్యమేనని అంగీకరిస్తూ, బాహ్యజగత్తుయొక్క కేవల ప్రతిబింబాన్నే కాక ప్రత్యక్షంగా బాహ్యవస్తువులనుకూడా మనం చూడగలుగుతున్నామని వైభాషికులు విశ్వసిస్తారు. వీరిది పూర్తిగా వాస్తవికవాదం. బాహ్య వస్తువులేకుండా బాహ్యానుమేయం సంభవించదని వీరి నమ్మకం. వీరి వాదాన్నే బాహ్యప్రత్యక్షవాదమనికూడా అంటారు. వీరి సిద్ధాంతానికి ఆధారం అభిధమ్మపిటకం.

## హీనయానం, మహాయానం

బోధిధర్మం మహావృక్షమై హీనయాన, మహాయాన శాఖలుగా చీలిపోయిందని సామాన్యంగా అందరికీ తెలిసినదే. ఒకే వృక్షజన్యములైనా ఈ రెండు శాఖలు భిన్నదిశలుపట్టి విస్తరించాయి.

హీనయానులకు నిర్వాణమే గమ్యస్థానం. జైనులకువలెనే వీరు నిరీశ్వరవాదులు. ఈశ్వరుని స్థానంలో జగచ్చక్రాన్ని పరివర్తింపజేసే కర్మను లేక ధర్మాన్ని వీరు నిలిపారు. ఈ కర్మ నియమాన్ని అనుసరించి ప్రతివాడు తన పూర్వకర్మ నియంత్రితమైన దేహం, మనస్సు, జీవితం పొందుతాడు. కర్మబంధాల నుండి మానవుడు విముక్తి పొందగలడానికి సాక్ష్యంగా బుద్ధుని జీవితాన్ని హీనయానులు ఆదర్శంగా భావిస్తారు. బుద్ధుని మార్గాన్నే అనుసరించి, ఈ జీవితంలోనో, లేక మరో జీవితంలోనో అర్హతులు కాగలమని వారు భావిస్తారు. 'నీ ముక్తిని నీవే సంపాదించుకోవాలనే బుద్ధునిసూక్తి ననుసరించి వీరు స్వయంకృషిద్వారానే నిర్వాణ పదం చేరుకో ప్రయత్నిస్తారు. బుద్ధుని ఆదర్శాన్ని, బుద్ధధర్మాన్ని తప్ప వీరు మరి దేని సహాయం అపేక్షించరు కనుక, హీనయాన మతం వజ్రసంకల్పంగల దృఢచిత్తులకే తప్ప సామాన్యులకు అనుసరణ సాధ్యంకాలేదు.

మహాయానం దీనికి భిన్నమైనది. మహాయానులు వ్యక్తివిముక్తిని నిరసించారు. బుద్ధుడు తాను విముక్తి పొందడంతో తృప్తి పడక, కోటిమానవులనుకూడా బంధవిముక్తులను చేయడానికి తన దీర్ఘ జీవితకాలాన్ని వినియోగించాడని, ఎవరికివారు విముక్తిని కోరుకోవడం స్వార్థమనీ, సమస్తప్రాణి కోటిని తరింపజేయడమే బౌద్ధుల ఆదర్శమై ఉండాలని వీరు వాదిస్తారు. నిర్వాణసిద్ధి తరువాత ప్రపంచానికి దూరంగా ఉండక, మానవులతో కలిసిమెలిసి తిరుగుతూ, వారిని కూడా తరింపజేయడానికి ప్రయత్నించాలి. ఈవిధమైన ప్రయత్నం చేసేవాడు బోధిసత్త్వుడవుతాడు. బోధిసత్త్వుడు మహాకరుణాపూరితమైన చిత్తంగలవాడై, మహా ప్రజ్ఞావంతుడై జీవకోటిని ఉద్ధరించడానికి అనేక జన్మలెత్తుతూ ఉంటాడు. జనన మరణబాధితుడైనప్పటికీ బోధిసత్త్వుడు నిస్సంగుడై ఉంటాడు. తన సత్కర్మఫలితాలను ప్రాణికోటికి ఇచ్చి, వారి దుష్కర్మఫలితాలను తాను స్వీకరిస్తాడు. కనుక ప్రతివాడూ బోధిసత్త్వుడు కావడానికే కృషిచేయాలి.

అయితే ప్రతివాడూ బోధిసత్త్వ స్థితికి ప్రయత్నించగలవాడై ఉండడు. అటువంటివారికి మహాయానమతం మరొక మార్గం సూచించింది. ప్రాచీన బౌద్ధంలో ఈశ్వరునికి స్థానంలేదు. దుఃఖపీడితులు, బలహీనులు అయిన అశేషమానవులకు అది నిష్ప్రయోజనం కనుక మహాయానులు కరుణాళువైన బుద్ధుణి ఈశ్వర స్థానం అలంకరింపజేశారు. గౌతమ బుద్ధుడు పరమార్థసత్యంయొక్క అవతారమనీ, ఆ పరమార్థసత్యం ధర్మకాయం ధరించి సర్వ ప్రాణులముక్తికై పాటుపడుతుందనీ వారి విశ్వాసం. ఇలా ధర్మకాయం ధరించే పరమ సత్యాన్నే మహాయానులు అమితాభ బుద్ధుడనికూడా అన్నారు. ఈ అమితాభుడే వారికి ఈశ్వరుడైనాడు.

ఆయా పరిణామాలవలన మహాయాన మతం భారతదేశపు ఎల్లలు దాటి అనేక జాతులవారిని, అనేక దేశాలవారిని, అనేక మతాలవారిని తనలో చేర్చుకోగలిగింది. అసంఖ్యాకజనులు బౌద్ధమతం స్వీకరించారు. చైనా, జపాన్, కొరియా మొదలైన ఆసియా దేశాలలో ఈ మహాయానమతం విశేషంగా వర్ధిల్లింది. ఆయా దేశాలలో ప్రజల ఆచారాలను, విశ్వాసాలను, సంస్కృతిని తాను స్వీకరించి ఎన్నో మార్పులు పొందింది. ఈ మార్పులవలన బౌద్ధమతం భారతదేశంలో క్షీణించిపోయినప్పటికీ, ఆ మార్పులవలననే ఇతర దేశాలలో కాలూని నిలద్రొక్కుకోగలిగిందని చెప్పవచ్చును.



"దాని తెలుపు
అది శుద్ధమైనదని
నాకు తెలుపుచున్నది"
అని ఎమ్. ఎన్. రాజమ్
చెప్పుచున్నది
అందుచేతనే నేను ఎల్లప్పుడూ
లక్స్ టాయ్‌లెట్
సబ్బును వాడుచున్నాను."




ఎమ్. ఎన్. రాజమ్ ఇలా చెప్పుచున్నది:













సినీమా తారలకు సౌందర్యమునిచ్చు శుద్ధమైన తెల్లని సబ్బు

LTS. 480-X52 TL

భారతదేశంలో తయారుచేయబడినది

# ధర్మదీక్ష

౧

[తెరలో]

"మనం కదా దుష్కర్మలు చేస్తున్నాం
మనం కదా బాధ ననుభవిస్తున్నాం
మనమే మరి దుష్కర్మలు మానా లంటే
మనమే ఇక సద్ధర్మలు కావా లంటే

"మనం కాక మనల్నెవరు రక్షిస్తారు?
ఎవరూ రక్షించలేరు-ఎవరూ రక్షించబోరు
మనమే ధమ్మపదంలో సాగాలంటే
మానులు మార్గాదేశం చేస్తారంటే."

(ధమ్మపదం)

(కళింగపట్టణంలో ఒక వీధి మొగ. కళింగ యుద్ధం ముగిసిన తర్వాత అశోకుడు కళింగ రాజధానిలో ప్రవేశించిన మరునాటి ఉదయం.)

ఒక పౌరుడు: ఈ అశోకచక్రవర్తి కెందు కింత జయాకాంక్ష?

రెండవ పౌరుడు: ఈతడు పట్టాభిషిక్తుడైన ఈ ఎనిమిదేళ్లుగా మారణ హెూకవిలాస మైపోయింది.

మూడవ పౌరుడు: గతంలో ఒక్కసారిగా ఇంత జనప్రళయం ఎప్పుడూ జరగలేదేమో?

బౌద్ధభిక్షువు: (ప్రవేశిస్తూ) ఏమిటి బాయనలారా?

ఒకటవ పౌరుడు: (నిర్వేదంతో) కళింగ యుద్ధం ముగిసినందుకు సంతోషిస్తున్నాం.

బౌద్ధభిక్షువు: (గంభీరంగా) ఇక ధర్మ యుద్ధం ఆరంభం కావలసిఉంది.

మూడవ పౌరుడు: ఈ యుద్ధంలో మరణించినవా రెందరని?

ఒకటవ పౌరుడు: లక్షా యాభై వేలమంది హతులయారు.

రెండవ పౌరుడు: లక్షా యాభై వేలమంది బందీ లయారు.

మూడవ పౌరుడు: క్షతగాత్రు లింకా ఎందరో.

భిక్షువు: (సాలోచనగా) బుద్ధాదేశం ప్రచలిత మౌతున్న ఈ రోజుల్లో ఇంకా ఇలాటి మారణహోమా లేనా?

ఒకటవ పౌ: బుద్ధాదేశాన్ని మన్నించే ప్రభువు లింకా అవతరించలేదు.

భిక్షువు: ఈనాడు ఈ కళింగదేశం మాత్రమే ఈ యుద్ధ జ్వాలల్లో దగ్ధమయింది. ప్రభువులు తల్చుకుంటే సమస్త ప్రపంచమూ ఒకనాడు దగ్ధమై పోవచ్చు.

(ఇద్దరు రాజభటులు ప్రవేశిస్తారు)

ఒక భటుడు: (రూక్షంగా) ఏమిటి మీరు మాట్లాడేది? ఎవరు మీరు?

రెండవ పౌరుడు: మేం పౌరులం.

భిక్షువు: నేను బౌద్ధ భిక్షువును.

రెండవ భటుడు: అశోక చక్రవర్తి నీ కళింగయుద్ధాన్ని నిందించవలసిన పనిలేదు మీకు.

ఒకటవ పౌరుడు: (నిర్భయంగా) ప్రజల నోళ్ళను మూయవలసిన పనిలేదు రాజుకు.

భిక్షువు: శాంతిధామం కావలసిన జీవలోకంలో అశాంతిని రగిలించటం రాజ ధర్మం కాదు.

ఒకటవ భటుడు: (పరుష భీకరంగా) రాజనింద చేస్తున్నారు. పదండి చెరసాలకు.

ఒకటవ పౌరుడు: (మళ్లీ నిర్భయంగా) ఈ రాజు పాలనలో చెరసాలలే ప్రశాంతంగా ఉంటాయి.

(భటులు పౌరులకు శృంఖలలు వేస్తూ ఉంటారు)

భిక్షువు: శాంతి ప్రియులైన ప్రభువులు భూలోకంలో అవతరించరూ? ఈ నా ప్రాణాలను ఆహుతిచేసి అయినా ఈ అశోక చక్రవర్తివంటివారిని శాంతి ప్రియులనుగా చేయలేనూ? నా తపస్సు ధారపోయలేనూ?

రెండవ భటుడు: భిక్షూ-రా-చెరసాల స్వర్గంలా ఉంటుందనుకుంటున్నావేమో నీకు తగ్గ శిక్ష నీకూ వేస్తారు.

భిక్షువు: సంతోషం. అశోక చక్రవర్తికి జనులను పీడించటమంటే అంత ఇష్టమని నే నెరుగుదును. నడవండి. (నిష్క్రమిస్తారు.)

౨

(తెరలో)

ఏ దివ్య మహిమమో ఏ ఇంద్రజాలమో

*~~~~~~~~~~~~~~*

సూరంపూడి భాస్కరరావు

*~~~~~~~~~~~~~~*

గగన తరుకుసుమ లాక్క్వరత్రయ కనుపింమా తైలమ్ము ఇసుమునం దావిర్భవించమా.

* * *

(కళింగ పట్టణంలో రాజప్రాసాదంలో సభామంటపం సింహాసనంమీద అశోకుడు. ప్రక్కన దండసచివుడు ఖల్లటకుడు నిలబడి ఉన్నాడు. ఒక సేవకుడు వింజామర వీచుతున్నాడు. ద్వారంవద్ద ఒక సేవకుడు నిలబడి ఉన్నాడు).

ఖల్లటకుడు: (సేవకుడితో) సిద్ధం చేశారా?

సేవకుడు: చిత్తం (తలవొంచుతాడు).

ఖల్లటకుడు: బందీలను ప్రవేశ పెట్టమను.

సేవకుడు: చిత్తం (నిష్క్రమించి తిరిగి ప్రవేశించి ద్వారం వద్ద నుంచుంటాడు. ఇద్దరు భటులు, శృంఖలాబద్ధులై ముగ్గురు పౌరులూ బౌద్ధ భిక్షువూ ప్రవేశిస్తారు.)

అశోకుడు: ఎవరీ బందీలు!

ఒకభటుడు: వీళ్లు పౌరులు. ఇతడు బౌద్ధ భిక్షువు. యుద్ధప్రసక్తి తెచ్చి రాజనింద చేసిన నేరానికి బంధింపబడ్డారు. (అని తల వొంచుతాడు.)

అశోకుడు: (తలపంకించి వాళ్ళవైపు చూస్తూ) అశోకచక్రవర్తి ఎంత చిన్న నేరానికైనా మరణదండన విధిస్తాడని మీ రెరుగరూ?

ఒకటవ పౌ: ఏ చిన్న నేరం కూడా చేయకపోయినా మరణదండన విధించగలడని మే మెరుగుదుము.

రెండవ పౌ: మనసు విప్పి చెప్పలేక పోవడంకన్నా మరణించడమే మేలు.

భిక్షువు: మహారాజా నీ ప్రవర్తన మహా ఘోరంగా ఉన్నదని చెప్పడం నా విధి.

ఖల్లటకుడు: చాలు. ఇక వదరబోకండి. రాజ సమక్షంలోనే రాజనింద చేస్తున్నారు మీరు.

ఒకటవ పౌ: పరోక్షంలో చేయడం కన్నా సమక్షంలో చేయడంవల్ల ప్రయోజనం ఉండవచ్చు.

అశోకుడు: హుం! ఇంకొక గడియలో మీ తలలను అరటిగెలలను నరికినట్టుగా చండగిరికుడు నరికివేస్తాడు. ఈలోగా మీ మనసులో ఉన్నది వెళ్ళగక్కుకోండి.



వరదముద్ర
(క్రీ. శ. 6 వ శతాబ్దపు అజంతా శిల్పం. 10 వ గుహాలోనిది)

# ★ ధర్మదీక్ష ★

భిక్షువు : మహారాజా నీ క్రౌర్యాన్ని కూకటి వేళ్ళతో పెకలించివేయాలని నా దీక్ష.

అశోకుడు : (వినోదంగా) మంచిదే. నా అంత క్రూరులింకెవ్వరూ లేరా?

భిక్షువు : ఇంతవరకూ లేరు. ముందు యుగాల్లో ఉండబోతారేమో.

ఖల్లటకుడు : మహారాజా వీళ్లు మితిమీరుతున్నారు. సహించడం బాగాలేదు.

భిక్షువు : ఖల్లటకా, యువరాజైన సుసీముడిపైన వైరం వహించి ఈ అశోకుడిచేత భ్రాతృహత్య చేయించావు. అశోకుడు సింహాసనమెక్కిందిమొదలు ఎంతమంది మానవులను తన కరకు కత్తితో వధించాడో లెక్కలేదు. ఈ రక్తతృష్ణ కంతులేదా? కరుణాతృష్ణతో చల్లబడుతుంది గాని, రక్తవృష్టితో భూమి చల్లబడుతుందా ఖల్లటకా?

ఒకటవ పౌ : నీలాంటి అయిదువందల మంత్రుల శిరస్సులను ఈ అశోకుడు స్వహస్తంతో ఖండిస్తూఉంటే నీ శిరస్సు కాదు కదా అని సంతోషించి బ్రతుకుతున్నావు.

రెండవ పౌ : ఈ అశోకుని వికారస్వరూపాన్ని పరిహసించిన అయిదువందలమంది స్త్రీలను సప్రాణంగా దహనం చేయించిన మహానుభావుడికి తగిన మంత్రివి నివు.

అశోకుడు : (నవ్వి) మీరు నా గుణాలను కీర్తిస్తూంటే నా కెంతో సంతోషంగా ఉంది.

భిక్షువు : మహారాజా నీవు ఇతిహాస పురాణాలను లేశమాత్రంగా కూడా చదవలేదా? రాజనీతి తెలిసేంతవరకైనా శాస్త్రాభ్యాసం చేయలేదా? ఆశ్రితులను అవిచారితంగా స్వహస్తంతో శిరశ్ఛేదనం చేయడం రాజోచితమైన పనిగానే నీకు తోచిందా?

అశోకుడు: (నవ్వుతూనే) స్వహస్తంతో తలలు నరకడం క్రీడామాత్రంగా ఉంటుంది నాకు.

భిక్షువు: నీవు క్రూరాశోకుడుగా మాయని కీర్తిని గడించావు.

అశోకుడు: పాపం రాధగుప్తుడు జాలిగుండెవాడు. అతడు బాధపడితే శిరశ్ఛేదకార్యం నిర్వర్తించేందుకు చండగిరికుడనే తలారిని కొత్తగా నియమించాను.

భిక్షువు: అశోకచక్రవర్తి దయ వల్ల పుక్కిటిపురాణాల్లో చెప్పబడే నరకం నేడు ప్రత్యక్షంగా కనబడుతోంది.

అశోకుడు: (వికటంగా నవ్వి) ఇంకా ప్రత్యక్షం కాలేదు. (సాభిప్రాయంగా) ఖల్లటకా.

ఖల్లటకుడు: సర్వవిధ మాలిన్యముతో నిండిన నూనెమూకుడు మరుగుతూ సిద్ధంగా ఉందని సేవకు డిదివరకే చెప్పాడు. తమఆజ్ఞ కోసమే ఎదురుచూస్తున్నాను.

అశోకుడు: (భటులతో) ఈ భిక్షువును తీసుకువెళ్లి ఆమరిగేనూనెలో పడవెయ్యండి. ఈ పౌరులా మనోహరదృశ్యం తిలకిస్తారు.

(భటులు పౌరులను భిక్షువును తీసుకొని నిష్క్రమిస్తారు.)

అశోకుడు: ఖల్లటకా.

ఖల్లటకుడు: ప్రభూ.

(రాధగుప్తుడు ప్రవేశిస్తూంటే సేవకుడు తలవొంచుతాడు. రాధగుప్తుడు ఓరగా నుంచుంటాడు.)

అశోకుడు: (వికటంగా) ఆభిక్షువు గిలగిలతన్నుకుంటూఉంటే భటులు ఎత్తి అతణ్ణా మూకుడులో పడేస్తారు.

ఖల్లటకుడు: ఔను మహారాజా.

అశోకుడు: మొర్రోయ్యమని అరుస్తాడు. దేవుడాఅని ఏడుస్తాడు. అమ్మా బాబోఅని కేకలు పెడతాడు. ఎవడు రక్షించేవాడు?

ఖల్లటకుడు: ఔను మహారాజా ఎవడు రక్షించేవాడు?

అశోకుడు: (గర్వంగా) కావాలంటే నేను రక్షించగలను.

ఖల్లటకుడు: నిజమే. తల్చుకుంటే తమరు రక్షించగలరు.

అశోకుడు: అతడిమాంసం ఉడికిపోయి ఉంటుంది. అతనుముద్దయిపోయిఉంటాడు.



అభయ ముద్ర
క్రీ. శ. 9-వ శతాబ్దపు నలందా బుద్ధ శిల్పం



యక్షిణి
జగ్గయ్యపేట, ఆంధ్రశిల్పం.

ఇంక ప్రాణంపోతుంది అన్నప్పుడు అతణ్ణి ఇవతలకు తీయమనకపోయావా?

ఖల్లటకుడు: అవును. అతడు చచ్చిపోలేదు. ఇవతలకి తీయమని చెప్పాను.

(సేవకుని చూచి వెళ్ళమన్నట్టు తల ఊపుతాడు. సేవకుడు నిష్క్రమిస్తాడు.)

అశోకుడు: ఏ దేవుడూ అతణ్ణి రక్షించలేదు. నేను అతణ్ణి బ్రతకనిచ్చాను

ఖల్లటకుడు: ఔను. మీరే అతణ్ణి బ్రతకనిచ్చారు.

రాధగుప్తుడు: (దగ్గరగా వస్తూ) మహాప్రభూ.

(ఖల్లటకుడు ఒక అడుగు పక్కకు తప్పుకుంటాడు.)

అశోకుడు: (అప్పుడే చూచి) రాధగుప్తుడా! (నవ్వి) మళ్ళీ నీకిష్టంలేని పనిచేస్తున్నాను.

రాధగుప్తుడు: చక్రవర్తీ నీపట్ల నాకెన్నో ఆశలున్నాయి. నీవూ నేనూ ఆబాల్యమిత్రులము. నీవు ధర్మప్రభువౌతావని, నీకు ధర్మసచివుణ్ణై నీకీర్తిలో భాగం పంచుకుందామని విన్ను విడవకుండా సేవిస్తున్నాను. నీవు ధర్మప్రభువయే ముహూర్తం ఇంకా దూరంగానే ఉంది కాబోలు.

అశోకుడు: ప్రభుణ్ణైతే చాలదా? ధర్మప్రభువేమిటి?

రాధగుప్తుడు: ప్రభూ ఆ బౌద్ధభిక్షువును జీవన్నరకంలో త్రోసి నీవు సాధించేదేమిటి?

అశోకుడు: (ఆలోచనాశూన్యంగా) ఏమిటి ఖల్లటకా?

ఖలటకుడు: (నిశ్చయంతో) రాజనింద చేసేవారు దండ్యులు. వారిని దండించే అధికారం దండసచివుణ్ణైన నాచేతిలో ఉంది. (రాధగుప్తునివంక చూసి) నీవు ప్రశ్నించవలసిన అవసరం లేదు.

రాధగుప్తుడు: ధర్మంతో సంబంధంలేని దండనలోకంలో లేదు. ఉంటే అది నరకంలోనే ఉంటుంది.

ఖల్లటకుడు: అయితే రాజనింద చేయవచ్చునని ధర్మసచివుని అభిప్రాయమా?

రాధగుప్తుడు: చేయవచ్చునని నేననను. కాని—పామరజనుడు పరమ విష్ణుస్వరూపుడు. తనదుఃఖంలో అతడు పలికినమాటయే పరమసత్యం. ఆ సత్యాన్ని గుర్తించి రాజు ఆత్మసంశోధనం చేసుకోవాలి.

అశోకుడు: ఈ వాద మెందుకుగాని, ఆ బౌద్ధభిక్షు ఏపాటికి కాలుతుంటాడు. అతడి మాంసం వంటవండినట్లు ఉడికిపోయి ఉంటుందికదూ?

రాధగుప్తుడు: ఉడికిపోయినా ఆ మాంసాన్ని జంతువులుకూడా భుజించవు. మీరూ మీ దండసచివుడు భుజిస్తారా ప్రభూ.

అశోకుడు: భుజిస్తావా ఖల్లటకా?

ఖల్లటకుడు: (రోషంతో) భుజించటానికి వండినమాంసం కాదని ధర్మసచివుడికి తెలియదు.

రాధగుప్తుడు: ప్రభూ, నీతండ్రి బిందుసార మహారాజు రాజ్యానికివచ్చిన కొత్తలో మా తాతగారు చంపాపురిలో పౌరోహిత్యం జరుపుకుంటూ ఉండేవారు. మా తాతగారికి సుభద్రాంగి అనే కూతురుండేది. ఆమెకు ఇద్దరు బిడ్డలు కలుగుతారని, వారిలో ఒకడు ధర్మప్రభువౌతాడనీ, రెండవవాడు భిక్షువౌతాడనీ మా తాతగారికి జ్యోతిష్కుడు చెప్పాడట. అప్పుడు మా తాతగారు, మా మేనత్త సుభద్రాంగిని బిందుసార మహారాజుకిచ్చి వివాహం చేశారు. ఆతర్వాత నీవూ, తిష్యుడూ ఆమెకు జన్మించారు. నీవు ప్రభువైనావు. తిష్యుడు భిక్షువైనాడు. కాని నీవింకా ధర్మప్రభువు కాలేదు. నాకదే చింతగా ఉన్నది.

అశోకుడు: (తనలోనే కంగా) ఆ నూనెలో కాగిన బౌద్ధభిక్షు ఎంకా మరణించి ఉండడు కదూ?

రాధగుప్తుడు: చక్రవర్తీ అమాయకులపట్ల చూపబడుతున్న నీ దండపారుష్యం వాళ్ళను మరింత తేజస్వంతులనుగానూ నిర్మలమూర్తులనుగానూ చేస్తుంది. నీదండన వాళ్ళను శిక్షించలేదు.

అశోకుడు: (ముఖం చిట్లించి తన స్వరంలో) శిక్షించలేదూ?

సేవకుడు: (ప్రవేశించి) ప్రభూ ఆశ్చర్యం.

అశోకుడు: ఏమిటి?

సేవకుడు: బౌద్ధభిక్షుకుడు చనిపోలేదు.

అశోకుడు: భిక్షుకుడు చనిపోవటం మా ఉద్దేశం కాదు.

సేవకుడు: అదికాదు మహాప్రభూ—అతడిని మరుగుతున్న నూనెలో వేశాం.

అశోకుడు: అది మా ఆజ్ఞ. అయితే ఏమయింది?

సేవకుడు: అతడి ముఖంలో చిరునవ్వు మాయలేదు.

అశోకుడు: ఓర్చుకున్నాడు కాబోలు. సన్యాసి గంభీరుడై ఉంటాడు.

సేవకుడు: అతడి శరీరం ఉడికిపోయిందనుకున్నాం.

అశోకుడు: మరేమయింది?

సేవకుడు: ఒక ముహూర్తం సేపు



యక్ష
జగ్గయ్యపేట. ఆంధ్రశిల్పం.

ఊడుకుతున్నట్లే అనిపించింది.

అశోకుడు : తరువాత?

సేవకుడు : కాని అతని శరీరం కందనైనా కందకుండా ఉండటం మాకళ్ళతో చూచాం.

అశోకుడు : కింద బాయిలో నిప్పు లేదేమో. (నవ్వుతాడు.)

సేవకుడు : కాదు ప్రభూ. కింద కొలిమి మండిపోతోంది. వజ్రతుండుడు కాలుతోందా లేదా అని నూనెలో చేయిపెట్టాడు ఆ చేయి మగ్గి ముద్దైపోయింది.

అశోకుడు : మరైతే అతడెందుకు మగ్గిపోలేదు?

సేవకుడు : ఇంతలో ఒక తెల్లతామర పువ్వు ఆ నూనెలోనుంచి బయలుదేరింది.

అశోకుడు : ఇదేమి ఇంద్రజాలమా?

సేవకుడు : ఆ భిక్షువు మిమ్మల్ని అక్కడకు రమ్మని ఆజ్ఞాపిస్తున్నాడు. ఆ తెల్ల తామరపువ్వులో ఆయన పద్మాసనస్థుడై ధ్యానబుద్ధునివలె కూర్చుని ఉన్నాడు.

అశోకుడు : ఏమిటి దీనిఅర్థం ఖల్లటకా?

ఖల్లటకుడు : మీరు చెప్పినట్టే ఆతడు ఇంద్రజాలికుడై ఉంటాడు మహారాజా.

అశోకుడు : ఏమిటి దీనిఅర్థం రాధగుప్తా?

రాధగుప్తుడు : "ప్రాణిహింస ప్రాణిధర్మంకాదు. ప్రాణిరక్షణ ప్రాణిధర్మం" అని ఉద్బోధించే దివ్యసాక్షాత్కారమేమో అయి ఉంటుంది ప్రభూ. నీవు ధర్మప్రభువు అయే శుభక్షణ మాసన్నమైనట్టున్నది. పోయి దర్శనం చేసుకుందాం.

(సాశ్చర్యంగా అశోకుడు లేస్తాడు తెర వాలుతుంది.)

## 3

(తెరలో) ఏ దివ్యమహిమో

ఏ ఇంద్రజాలమో

కాలాగ్ని చంద్రా

శప మృటుల తోచూ

బోతి గుండియరో

కరగి పల్లవించు.

[ప్రాసాద బహిరంగణంలో దూర దూరంగా లతాగుల్మాదులు కనిపించుతూ ఉంటాయి. ఎదురుగా కొలిమిమీద మూకుడు ఆ మూకుడులో తెల్లతామర పూవు. బౌద్ధ భిక్షువు దివ్యతేజస్సుతో నిండిన ముఖంతో ఆ పద్మంలో ఆసీనుడై యున్నాడు. ఒక ప్రక్కగా భటులు ఇంకొక ప్రక్కగా పౌరులు చకితులై నిలబడియున్నారు.

అశోకుడు, రాధగుప్తుడు, ఖల్లటకుడు ప్రవేశిస్తారు. ఖల్లటకుడు సాటోపంగా బౌద్ధభిక్షువును పలకరించబోయి చూస్తూ చూచి ఊరుకుంటాడు. రాజు నిర్ఘాంతపోయి నిలుచుంటాడు. రాధగుప్తుడు మోకరిల్లుతాడు. భిక్షువు ముఖంలో సన్నని నవ్వు తాండవిస్తూ ఉంటుంది.]

అశోకుడు : (ఏదేకంగా చూస్తూ) రాధగుప్తా ఇది ఇంద్రజాలం కాదా?

(రాధగుప్తుడు బదులాడడు.)

బోధిసత్త్వుడు : బుద్ధం శరణం గచ్ఛామి.

అశోకుడు : (ఉలికిపాటుతో) రాధగుప్తా ఇతడేమిటి అంటున్నాడు?

బోధిసత్త్వుడు: ధమ్మం శరణం గచ్ఛామి.

అశోకుడు : (పిరికిగా, ఒంటరివాడై పోయినట్టుగా, జుట్టు పీకుకుంటూ) రాధగుప్తా ఎవరితడు నిందిస్తున్నాడు?

బోధిసత్త్వుడు: సంఘం శరణం గచ్ఛామి.

అశోకుడు : (వెఱ్ఱిగా గొంతెత్తి) రాధగుప్తా పలకవేమి?

రాధగుప్తుడు : (తెప్పరిల్లి లేస్తూ) ప్రభూ

అశోకుడు : ఎందుకో చాలా భయంగా ఉంది రాధగుప్తా.

రాధగుప్తుడు : ఆయన ముఖంలోనికి చూడు చక్రవర్తీ

అశోకుడు : ఆయన నా చక్రవర్తిత్వాన్ని మించిన సార్వభౌమత్వం కలవాడిలా కూర్చున్నాడే!

రాధగుప్తుడు : ఆయన ప్రాణికోటికి శాంతి సామ్రాజ్యాన్ని సాధించి పెట్టగల అధినేత.

అశోకుడు : మరి నేను?

ఒక పౌరుడు : (తీక్షణంగా) నీవు క్రూరాశోకుడవు. నీవు చండాశోకుడవు. నీవి లోకాన్ని నరకప్రాయంగా చేస్తున్న పాషాణ హృదయుడవు.

అశోకుడు : (ఆర్తితో) రాధగుప్తా

రాధగుప్తుడు : ఆయన సంఘంలో సామాన్యునిలోను సౌమనస్యాన్ని సృష్టించగల కారుణ్యవిధాత. ఆయన లోకాన్ని స్వర్గప్రాయంగా చేయగలడు.

అశోకుడు : మరి నేను?

ఒకటవ పౌ : నీవు ప్రాణికోటిని జీవన్మరణానికి గురిచేసే రాక్షసుడవు. ధర్మభీతిలేని పాషండుడవు. పెద్దపులి సహజమైన కోరలలోనే హింసాకాండ నడుపుతుంది. నీవు అసహజమైన ఖడ్గాదులతో హింసాకాండను సాగించే దుష్టజంతువు. నీవు నరుడవు కాదు.

అశోకుడు : (భీతిపడి) నిజమేనా రాధగుప్తా? నన్ను వీళ్లు ఒక్కసారిగా కత్తితో పొడిచి వేస్తారు కాబోలు. రాధగుప్తా వీళ్లకు కత్తి దొరకనివ్వకు.

రాధగుప్తుడు : మహారాజా! మానవుడు జన్మించినది ఇతరులను హింసించి దుంఖపెట్టడానికి కాదు. సుఖదుఃఖాల అల్పత్వాన్ని ఋజువుచేసే శాంతిని సాధించడానికి, పరస్పరానురాగం సాధించడానికే మానవుడు సృష్టిలో వెలిశాడు. ప్రేమమయమైన విశ్వబంధుత్వాన్ని సాధించడానికి మానవుడు సృష్టిలో వెలిశాడు. పగ పాములకు లక్షణం కావచ్చు. మానవులకు లక్షణం కాదు. చిత్రవధ చేయడం క్రూరజంతువుల లక్షణం కావచ్చు. మానవుల లక్షణం కాదు. ఘోరసంహారం జరపడం ప్రళయరుద్రుడి లక్షణం కావచ్చు. మానవుడి లక్షణం కాదు- ఆబోధిసత్త్వుడి ముఖంలోకి చూడు మహారాజా. నీకీ ఉపదేశం అంతా ఆయన ముఖంలోనుంచి వినిపించటం లేదూ?

అశోకుడు : (గాద్గదికతో) కాదు ఆయన ముఖం వెయ్యి బల్లెములు నావైపు విసురుతున్నట్లు మాస్తోంది. నన్ను చిత్రవధ చెయ్యబోతున్నట్లు చూస్తోంది. నా శరీరం తుండెములుగా అయిపోతున్నట్టు నాకనిపిస్తోంది. నాలోని ప్రతినరమూ, ప్రతి జీవకణమూ మొర్రోమని ఏడుస్తోంది. నేను చచ్చిపోతున్నట్లు నాకు అనిపిస్తోంది. ఆ ముఖం నా వంకనే చూస్తోంది. ఆ ముఖంలో క్రోధంలేదూ? క్రోధం లేకపోయినా నన్ను కాల్చివేసే మంటలను నామీదికి ప్రవర్తింప చేస్తోందేం? రాధగుప్తా ఇలాటి శాంతవదనాన్ని నేనెప్పుడూ చూడలేదు. రాధగుప్తా నాకు ఖల్లటకుడిముఖ లక్షణాలే అర్థమౌతాయి బోధిసత్త్వుల ముఖలక్షణాలు నాకర్థంకావు. రాధగుప్తా నన్ను పట్టుకో- నన్ను క్షమించమని ఆయనతో చెప్పు నన్ను కాల్చవద్దని చెప్పు— నేను బోధిసత్త్వుని చంపలేను— నేను బోధిసత్త్వుని రక్షించలేను. బోధిసత్త్వుడే నన్ను చంపగలడు— బోధిసత్త్వుడే నన్ను రక్షించగలడు— రాధగుప్తా— రాధగుప్తా-ఆయన కారుణ్యమూర్తి కదూ? రోదించి (సోలిపోతాడు).

రాధగుప్తుడు : ప్రభూ- ప్రభూ, (అశోకుణ్ణి కూర్చోబెడతాడు.)

(ఖల్లటకుడు పెదవి విరుస్తాడు- రాజును పలకరించబోతాడు.)

రాధగుప్తుడు : ఖల్లటకా- ఈక్షణంలో నీ విక్కడ ఉండరాదు. పరిపాకం చెందుతూన్న మహారాజు చైతన్యానికి నీ ఉపస్థితి ప్రతిబంధకము. దయ ఉంచి నీ వెక్కడికైనా బాదారామానికి వెళ్ళు. లేదా నీ వాసగృహానికే వెళ్లు—దయచేసి వెళ్లు—

ఖల్లటకుడు : మళ్లీ పెదవి విరిచి తలఊపి రెండు నిముషాలలో ఇదంతా వట్టిభ్రమఅని నిరూపించగలను.

రాధగుప్తుడు : ఓయి ఘోరస్వభావుడా! నిన్ని క్షణంలో ఆ మూకుడులోకి తోయించమన్నానా.

ఖల్లటకుడు : అక్కర్లేదు. ఆమూకుడులో



































# సన్‌లైట్ సబ్బు

బట్టలు చాలకాలము మన్నునట్లు చేయును

భారతదేశంలో తయారుచేయబడినది

# ★ ధర్మదీక్ష ★

తెల్ల తామరపువ్వును-తెల్ల తామరపువ్వులో బోధిసత్వుణ్ణి చూస్తున్న నువ్వు ఇష్టముంటే ఆ మూఢుడులో దిగు. (వెళ్ళిపోతూ) అశోకుడు ఇంతటి భీరువని నేననుకోలేదు.

రాధగుప్తుడు : అశోకుడు భీరువు కాడు. నీవు వజ్రహృదయుడవు. నీకుకూడా ధర్మచక్షువు విప్పారే క్షణం రాకపోదులే. (ఖల్లటకుడు నిష్క్రమిస్తాడు.)

బోధిసత్వుడు: అశోకసమ్రాట్ ! (అశోకుడు తలయెత్తి కళ్లు తెరుస్తాడు.)

రాధగుప్తుడు: ప్రభూ !

అశోకుడు : (ఆత్రంగా) ఆయన ఏడీ ? ఆ బోధిసత్వుడేడీ ? ఈ కళింగయుద్ధంలో మరణించిన లక్షలాది జనుల రక్తం మడుగు కట్టి మహాసముద్రమై నాకు కనిపించింది. ఆ సముద్రంలో ఆ లోతు తెలియని సముద్రంలో ఈదలేక, బ్రతకలేక, ఊపిరి పీల్చలేక తిన్నుకుంటూన్న నాకు—ఆయన ఎక్కడినించో చేయినందించాడు. రక్తస్నాతుడనైన నన్ను తన దయాపయోధారలతో ప్రక్షాళితుణ్ణిచేశాడు. ఆయన నన్ను క్షమించానన్నాడు. నా పాపాలకు నిష్కృతి ఉందన్నాడు. నాకు ధర్మదీక్ష నిస్తానన్నాడు. (బోధిసత్వునివైపు చూస్తూ కేవలోయి సాగిలబడిపోతాడు.)

రాధగుప్తుడు: (సంతోషతరంగితుడై) ఆయన నీ పాపానికి నిష్కృతి ఉందన్నాడా? అయిదువందలమంది మంత్రుల శిరస్సులు ఖండించిన పాపానికి నిష్కృతి ఉందన్నాడా? అయిదు వందల మంది స్త్రీలను కాల్పించిన పాపానికి నిష్కృతి ఉందద్నాడా? కళింగయుద్ధంలో లక్షలాది జనులను వధించిన పాపానికి నిష్కృతి ఉందన్నాడా? భ్రాతృహత్యచేసిన పాపానికి నిష్కృతి ఉందన్నాడా? వృద్ధ గురువును మరిగే నూనెలో వేయించిన పాపానికి నిష్కృతి ఉందన్నాడా?

(అశోకుడు ఒక్కొక్క వాక్యంతో బుద్ధగురూ, బుద్ధగురూ అని ఆక్రోశిస్తాడు.)

అశోకుడు: (చేతులమీద లేచి) నేను కర్మచండాలుడను రాధగుప్తా. నేను ఘోరమైన మారణాలు జరిపించాను. ఇక ఈమారణాలు జరిగించను. ఇక ఈ హింసాకాండ జరగనివ్వను. అయ్యో ఆ మహనీయుణ్ణి మరిగే నూనెలో తోయించాను. ఆయన మాత్రం నాయెడ కరుణచూపాడు. నాకు ధర్మదీక్ష నిస్తానన్నాడు.

బోధిసత్వుడు: అశోక సమ్రాట్ !

రాధగుప్తుడు: మహారాజా నిన్ను బోధిసత్వుడు పలకరిస్తున్నాడా?

అశోకుడు: (కనురెత్తితో ట్రుపాటుతో) ఈ కళింగయుద్ధంలో ఈ మారణమహాయజ్ఞములో పెరిగిన నా పాపపు పర్వతాలను ఆయుశ్శేషంతో నిర్మూలించుకోమని ఆదేశించిన నా బుద్ధగురువు నన్ను పలకరించాడా? గురుపరమేశ్వరా నీ ఉపదేశంతో నా జీవితాన్ని ధర్మప్లావితం చెయ్యి. నాకు ధర్మదీక్ష నియ్యి బుద్ధగురూ.

(రెండు క్షణాలు శబ్దశూన్యంగా గడిచిపోతాయి. బోధిసత్వుడు ఉపదేశవాక్యాలు పలకడం వినవస్తుంది.)

బోధిసత్వుడు : బుద్ధం శరణం గచ్ఛామి.

అశోకుడు : బుద్ధం శరణం గచ్ఛామి

రాధగుప్తుడు, పౌరులు : బుద్ధం శరణం గచ్ఛామి.

బోధిసత్వుడు : ధమ్మం శరణంగచ్ఛామి.

అశోకుడు : ధమ్మం శరణం గచ్ఛామి

రాధగుప్తుడు, పౌరులు : ధమ్మం శరణం గచ్ఛామి.

బోధిసత్వుడు : సంఘం శరణంగచ్ఛామి

రాధగుప్తుడు, పౌరులు : సంఘం శరణం గచ్ఛామి.

బోధిసత్వుడు : ఏవ్వం ధమ్మో వడ్ఢఇ.

అశోకుడు : ఏవ్వం ధమ్మో వడ్ఢఇ.

రాధగుప్తుడు, పౌరులు : ఇట్లుగా ధర్మము వర్ధిల్లును.

బోధిసత్వుడు : వినయసముక్కస్సే.

అశోకుడు : వినయసముక్కస్సే.

రా, పౌరులు : వినయసముత్కర్షమునందు ధర్మము వర్ధిల్లును.

బోధిసత్వుడు : అలియవసాణి.

అశోకుడు : అలియవసాణి.

రా, పౌరులు : ఆర్య వర్తనములందు ధర్మము వర్ధిల్లును.

బోధిసత్వుడు : అనాగత భయాని.

అశోకుడు : అనాగత భయాని

రా: పౌరులు : అనాగత భయము వలన ధర్మము వర్ధిల్లును.

బోధిసత్వుడు : మునిగాథా

అశోకుడు : మునిగాథా

రా: పౌరులు : ముని గాథలయందు ధర్మంబు వర్ధిల్లును.

బోధిసత్వుడు : మోనీయ సూతే

అశోకుడు: మోనీయ సూతే

రా : పౌ : ముని జీవనప్రవచనమున ధర్మము వర్ధిల్లును.

బోధిసత్వుడు: ఉపతిష్య పసినే

అశోకుడు: ఉపతిష్య పసినే

రా: పౌ: ఉపతిష్య ప్రశ్నల యందు ధర్మము వర్ధిల్లును.

బోధిసత్వుడు: లాఘులో వాదే ముసావాద మధిగిచ్య

అశోకుడు: లాఘులో వాదే ముసావాద మధిగిచ్య.

రా: పౌ: మృషావాద మధిగా రాహులునకు చెప్పిన దానియందు ధర్మము వర్ధిల్లును.

బోధిసత్వుడు: సమవాయ ఏవ సాధుః సమవాయ ఏవ సాధుః సమవాయ ఏక సాధుః

(బోధిసత్వుడు పద్మము అంతర్హితులవుతాయి.)

అశోకుడు: (గమనించకుండా) సమవాయ ఏవ సాధుః సమవాయ ఏవ సాధుః సమవాయ ఏవ సాధుః

రా: పౌరులు: (గమనించకుండా) సమవాయమే మేలైనది. సమవాయమే మేలైనది. సమవాయమే మేలైనది.

అశోకుడు : (కళ్లు తెరిచి) రాధగుప్తా బుద్ధ గురుడేడి? బుద్ధగురుడేడి?

రాధగుప్తుడు : అంతర్హితుడైనాడు. అశోకసామ్రాట్ నీవు ప్రియదర్శివి, నీవు దేవానాం ప్రియుడవు. నీకు బోధసత్వుని దివ్య సాక్షాత్కారం లభించింది. నీవు ధర్మప్రభువుగా అశేష కీర్తిని గడించగలవు.

అశోకుడు: అయ్యో ఇదంతా నా భ్రమ కాదు కదా—నా పాప నిష్కృతి భ్రమ కాదుకదా—నా ధర్మదీక్ష భ్రమ కాదు కదా!

రా: పౌ: కాదు అశోక ప్రభూ. అంతర్నేత్రం ఉన్మీలితమైన ఈ దివ్యముహూర్తంలో విశ్వశ్రేయో మంత్ర ముచ్చారితమైన ఈ దివ్య ముహూర్తంలో భ్రమకు తావెక్కడిది—ప్రభూ నీ జీవితాన్ని, నీ సర్వశక్తినీ ఆ బోధిసత్వుని పాదాలవద్ద అర్పించావు కదా, ధర్మదీక్ష పొందావుకదా నీ పాపం మాసిపోయినది. నీ ఆయుశ్శేషం ధర్మపథగామి యైనాక ఇంక నీకు పాప మెక్కడిది ?

(తెర వాలుతూ ఉండగా అందరూ)

బుద్ధం శరణం గచ్ఛామి
ధమ్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి. ★

# ధమ్మపదం

పువ్వుల పరిమళం గాలికి ఎదురుగా పయనించ లేదు. కాని సజ్జనుల కీర్తి నిరాఘాటంగా వ్యాపించగలదు.

* * *

నిద్రలేనివానికి రాత్రి సుదీర్ఘం; అలసినవానికి ఒక యోజనం సుదీర్ఘం, ధర్మపథ స్వరూపం తెలియని మూఢుడికి జీవితం బహుదీర్ఘం.

* * *

'ఇది నా సంతతి, ఈ సంపద నాది.' అనే మమకారంతో అజ్ఞాని సర్వదా మథనపడుతూ ఉంటాడు. తనే తనవాడు కాడు; ఇక సంతతి, సంపద ఏ మూల?

* * *

పాయసంలో గరిటె పసు తెలిసే రుచి ఎంత? జ్ఞానితో యావజ్జీవసాంగత్యం లభించిన మూఢుడికి గోచరించే 'సత్య' స్వరూపమూ అంతే.

* * *

బుద్ధిమంతుడు ఒకేఒక్క నిముషం పాటు జ్ఞానితో గడిపితే చాలు; పాయసం రుచి నాలుకకు తెలిసేటంత త్వరగా జ్ఞానోదయం అవుతుంది.

* * *

సహస్ర సమరాలలో సహస్రాధిక వీరుల్ని జయించిన వీరుడికన్న, తనను తాను జయించుకొన్నవాడు ఘనుడు, వీరాధివీరుడు.

* * *

గాలికి ఎదురు విసరిన దుమ్మువలె, నిర్మలుడూ అమాయకుడూ ఒకరికి చేటు చేయనివాడూ అయిన వ్యక్తిపట్ల, చెరుపు తలపెట్టినవాడు, దుష్ఫలితం అనుభవిస్తాడు.

* * *

విజయం పగకు దోహదకారి; పరాజితుడు విజేతపై పగపడతాడు. జయాపజయాలు రెండూ లేనివాడు సదా సంతుష్టుడు, సంతోషితుడు.

* * *

దేశాంతర మేగి, క్షేమంగా తిరిగివచ్చిన వానికి, బంధుమిత్రులంతా ఎదురేగి స్వాగత మిస్తారు. లోకాంతరం వెళ్ళిన పుణ్యవంతుడికి, అతని సత్కార్యాలే స్వాగతమిస్తాయి.

* * *

మూఢుడు గాబోయే రథంవలె, విజృంభించే క్రోధాన్ని నిగ్రహించుకోగలవాడే నిజమైన సారథి; తదన్యులంతా కాదు; కేవలం కళ్లాలుపట్టుకు లాగేవాళ్లే. ★



## ధ్యానిబుద్ధ

తక్షశిలలోని ఈ విగ్రహం క్రీ. శ. 5 వ శతాబ్దంనాటిది. నలందావలెనే తక్షశిలకూడా ప్రాచీనకాలంలో గొప్ప విద్యాకేంద్రంగా ఉండేది. ఇది రావల్పిండికి (పాకిస్థాన్) పశ్చిమోత్తరంగా పదిమైళ్లలో ఉన్నది.




సత్త్వుడు సిద్ధార్థుడుగా జన్మించే నిమిత్తం తుషితస్వర్గంనుంచి నిచ్చెనమీదుగా దిగి వచ్చిన దృశ్యం పైనున్న ము, ఆసనమూ ఆతడు స్వర్గంలో ఉన్నప్పటివి. క్రిందనున్న వృక్షము, ఆసనము భూమికి దిగి టివి. సర్వదేవతలు గొలుస్తూఉండగా ఆయన దిగినాడు. (సాంచీస్తూప ఉత్తరద్వారంమీది శిల్పం)

మాయాదేవి స్వప్నం



శుద్ధోదనుని భార్య మహామాయకు స్వప్నంలో తెల్లని ఏనుగు కనిపించింది. ఆ ఏనుగు తొండంతో ఒక ధవళపద్మం ధరించింది. మూడుసార్లు మాయాదేవి చుట్టూ ప్రదక్షిణం చేసి తుద కా ఏనుగు ఆమె గర్భంలో ప్రవేశించింది. మగ శిశువు జన్మిస్తాడని దైవజ్ఞులు స్వప్నఫలం చెబుతారు. (క్రీ. పూ. 2 వ శతాబ్దపు శుంగకాలంనాటి భార్హుత్ స్తూప శిల్పం.)

పదిమాసాల తరవాత ఒక వైశాఖ పూర్ణిమనాడు మాయాదేవి కపిలవస్తుకు సమీపంలో ఉన్న లుంబినీవనంలో సాలవృక్షచ్ఛాయలో సేదదీరుతుండగా ఆమె మగశిశువును ప్రసవిస్తుంది. మహాతేజశ్శాలియైన ఆ శిశువు చక్రవర్తియో లేక బుద్ధుడో అవుతాడని దైవజ్ఞులు చెబుతారు. చిత్రంలో ఎడమవైపు మాయాదేవి ప్రక్కనే ఉన్నవాడు శిశు బుద్ధుడు.

## సిద్ధార్థ జననం

(11 వ శతాబ్దపు [illegible] శిల్పం)



మహాభినిష్క్రమణ

ఫ

ం: సిద్ధార్థుడు సకల విద్యాపారంగతుడై, వివాహితుడైన తరవాత, ఒకసారి జరా, వ్యాధి, మరణ గ్రస్తులైన ముగ్గురు మనుష్యులను, ఒక సన్యాసినిచూచి విరక్తుడై, సత్యగవేషణార్థియై ఇల్లు విడిచి వెళ్ళిపోతాడు. (నాగార్జునకొండ శిల్పం)

ాగమనం: బుద్ధుడు సంబుద్ధిపొందిన అనంతరం ధర్మచక్రపరివర్తనం గావిస్తూ కపిలవస్తుకు తిరిగి వచ్చి, భార్య యశోధరకు ధర్మదీక్ష ఇప్పిస్తాడు. (గోలీ ఆంధ్రశిల్పం. క్రీ. శ. 3 వ శతాబ్దం)





సంబుద్ధిపొందకపూర్వం బుద్ధుడు బోధివృక్షచ్ఛాయలో ఉపవిష్టుడై సత్యం కనుగొనేవరకూ లేవనని శపథం చేసి, తన నిశ్చలతకు తాను కూర్చున్న భూమినే సాక్షివికమ్మని మూడుసార్లు తట్టుతాడు. ఆయన నిష్ఠలో ఉండగా మారుడు తన సైన్యాలతోను, కామినీగణాలతోనూ ముట్టడించి నిష్ఠాభంగం చేయజూస్తాడు. కాని బుద్ధుడు చలించడు. తుదకు మారుడు పరాజితుడై పారిపోతాడు.

## మారదర్షణం (అజంతా శిల్పం)

# నిర్వాణం



సంబుద్ధి పొందిన తరువాత బుద్ధుడు నలభై ఏండ్ల కాలం ధర్మచక్ర పరివర్తనం చేశాడు. తన 80 వ ఏట కుశీనారా అనే చోట (గోరఖ్పూర్ జిల్లా) ఒక సాలవనంలో పరినిర్వాణం చెందాడు. పై చిత్రం బెంగాల్ కు చెందిన మహా పరినిర్వాణ శిల్పం. క్రీ. శ. 10వ శతాబ్దంనాటిది.

దిగువచిత్రం, బుద్ధ నిర్వాణానికి మర పిల్లుతున్న భిక్షు, భిక్షుణీ బృందం - అజంతా శిల్పం.





ఆధునిక వంగ చిత్రకారుడు నందలాల్ బోస్ చిత్రించిన బుద్ధమూర్తి.

శాంతహే, ముక్తహే, హే అనంతపుణ్య,
కరుణాఘన, ధరణీతల కళంకశూన్య

(ఠాగూరు)

# వసుబంధుని పరివర్తన

మహాయాన బౌద్ధచరిత్రలో అసంగుడు, వసుబంధుడు చిరస్మరణీయులు. వీరిద్దరూ అన్నదమ్ములు. పురుషపురంలో ఒక బ్రాహ్మణ పండితవంశంలో జన్మించారు. చిన్నతనంలోనే వేదవేదాంగాలలో, సకల శాస్త్రాలలో నిష్ణాతులైనారు.

మహామేధావులు, పరమ కరుణాళువులు అయిన వీరిని బౌద్ధధర్మం అమితంగా ఆకర్షించింది. ఇరువురూ హీనయానబౌద్ధం స్వీకరించారు. అసంగుడు క్రమంగా మహాయాన మతానుయాయియైనాడు. మహాయాన తత్వశాఖ అయిన విజ్ఞానవాదానికి స్థాపకుడు, ఆచార్యుడు అయినాడు.

"బాహ్యప్రపంచం అంతా శూన్యం మనస్సు ఒకటే ఉన్నది ఈ మనస్సునుంచే బాహ్యప్రపంచం యావత్తూ జనిస్తున్నది," అనే వాదాన్ని అసంగుడు ప్రచారం చేశాడు.

అతని సోదరుడు వసుబంధుడు హీనయానమతానుయాయి సర్వాస్తివాదంలో విశ్వాసం గలవాడు అనతికాలంలో అతడు బౌద్ధతత్వంలోని వివిధ వాదాలన్నీ కరతలామలకం చేసుకున్నాడు. అయితే ఈ వాదాలేవీ జిజ్ఞాసాక్రాంతమైన అతని మనస్సుకు తృప్తి చేకూర్చలేకపోయాయి.

అసంగుడు తన సోదరుని ఏ విధానైనా తన మతానికి త్రిప్పివేయాలని ప్రయత్నిస్తున్నాడు. కాని అతని వాదాలన్నిటినీ నిశితబుద్ధియైన వసుబంధుడు పరాస్తం చేసివేస్తూ వచ్చాడు.

* * *

అది అయోధ్యానగరం. సువిశాలమైన ఆమ్రవనంలో చక్కని బౌద్ధవిహారం ఉన్నది. విహారంలో పలువురు శ్రమణకులు నివసిస్తున్నారు. విహారంలో ఎందరెందరో మహాశిల్పులు చెక్కిన సుందరశిల్పాలున్నాయి. అచేతనములైనప్పటికీ ఆ శిల్పాకృతులు సజీవంగా కదలాడుతున్నట్లు, ఏవో గడిచిపోయిన గాథలను, ఏవో మహత్తర సందేశాలను మాటలులేని భాషలో వివరిస్తున్నట్లు భాసించాయి. వాటిని చెక్కి అంత చైతన్యవంతాలుగా చేయగలిగిన శిల్పుల సంస్కారపరిపాకాన్ని మెచ్చుకుంటూ వసుబంధుడు వాటిమధ్య తిరుగాడుతున్నాడు.

ఇంతలో అసంగుడు లోనుండి వచ్చి తమ్ముని విహారోపరితలానికి తీసుకువెళ్లాడు. ఇప్పుడే వస్తానని చెప్పి కనుచాటైనాడు.

ఎదురుగా నదీప్రవాహం ఉన్నది. అది శరత్కాలం క్రమంగా చీకటిపడింది. కొంతసేపటికి చంద్రుడుదయించాడు. మందమందంగా మలయపవనాలు వీస్తున్నాయి చిన్నచిన్న మేఘశకలాలు చంద్రునితో దాగుడుమూతలాడుతున్నాయి. చంద్రికాశీకరస్నాతమై లోకమంతా ఏదో అలౌకికకాంతితో ప్రకాశిస్తున్నది ఆ ఏకాంత ప్రశాంతిని భంగంచేస్తూ పక్షుల అస్పష్ట కలకలస్వనాలు వినవస్తున్నాయి ఆ ధ్వనులు నిశ్శబ్దాన్ని మరింత గాఢం చేస్తున్నట్లున్నాయి

ఈ అపూర్వ రామణీయకం తిలకిస్తూ వసుబంధుడు మంత్రముగ్ధుడైనట్లు తన్మయుడైనాడు. ఆ క్షణంలో జగమొక మిథ్యగా, స్వప్నంగా, జీవితం ఆ స్వప్నాంతర స్వప్నంగా వసుబంధుని మానససరోవరంలో ఒక భావతరంగం కదలాడింది.

విహంగ కలకలధ్వానాలకు శ్రుతిగా, విహారంలోని తరునికుంజాలమధ్య దాగివున్న అసంగాచార్యశిష్యుడొకడు గురుప్రణీతశ్లోకభాగాలను మధురకంఠస్వరంతో గానం చేయసాగినాడు. వసుబంధుని మనస్సులో బయలుదేరిన స్వప్నభావతరంగం మరింత విస్తృతమైంది. శిల్పకారుని భావనలో జనించి మనోజ్ఞాకృతితో భాసించే శిల్పంవంటి ఈ సకల చరాచరజగత్తుయొక్క నిజతత్వం అతని మనస్సులో గాఢంగా నాటుకున్నది.

ఈ సత్యాన్ని ఇంతవరకూ కాదంటినే అన్న పరివేదన, పశ్చాత్తాపం అతన్ని దహించివేయసాగాయి. వెంటనే అతడు తన దోషానికి ప్రాయశ్చిత్తంగా నాలుక ఛేదించుకో నుద్యుక్తుడైనాడు.

ఇదంతా చాటునుండి కనిపెడుతున్న అసంగాచార్యుడు గభాలునవచ్చి అడ్డగించాడు. "నాయనా! నాలుక పెరుకోవడం అజ్ఞానలక్షణం. ఏ నాలుకతో సత్యాన్ని ఖండించావో ఆ నాలుకతోనే సత్యాన్ని ప్రచారం చెయ్యి దుఃఖపారావారంలో తలమునకలౌతున్న దీనమానవకోటిని తరింపజేయడానికి నీ జీవితనౌకను ఆయత్తం చెయ్యి ఇంతకంటె పరమధర్మం లేదు," అని ఉద్బోధించాడు

నాటినుంచీ వసుబంధుడు మహాయాన మతానుయాయియైనాడు. అభిధర్మకోశం, విజ్ఞప్తిమాత్రతా త్రింశకం మొదలైన ఉద్గ్రంథాలు రచించి ధర్మప్రచారం చేశాడు.

వసుబంధుడు క్రీ. శ. 270 ప్రాంతంలో జన్మించి, 350 ప్రాంతంలో మరణించాడని, చంద్రగుప్త విక్రమాదిత్యుని సమకాలికుడని చెబుతారు.



# ఆసియాలో బౌద్ధమత ప్రాభవం

శిశునాగవంశీయులలో ఐదవవాడైన బింబిసారుడు మగధరాజ్యం పాలిస్తున్న కాలంలో ప్రభవించిన బౌద్ధమతం మౌర్య చక్రవర్తి అశోక వర్ధనుని పరిపాలన కాలంలో (క్రీ. పూ. 269-232) మగధరాజ్యపు ఎల్లలను దాటి భారతవర్షమంతటా, విస్తరించి ఇరుగుపొరుగు ఆసియా దేశాలలోకి కూడా అడుగుపెట్టింది. అడుగుపెట్టిన నాటి నుంచీ, అది క్రమ క్రమ ప్రవర్ధమానమై మొత్తం ఆసియా ఖండమంతటా బౌద్ధ వాణిని మారుమ్రోయించింది.

బౌద్ధ మత ప్రచారాన్ని జీవిత పరమాశయంగా సాగించిన అశోకునివలననే బౌద్ధమతానికింత అనన్యసామాన్య ప్రాభవం కలిగిందనడం అతిశయోక్తి కాదు. అశోకుడు రాజ్యానికి వచ్చిన మొదటి 8 ఏళ్ల కాలంలో అందరు చక్రవర్తులవలెనే భోగవిలాసాలతో, హింసారతితో గడిపాడు. క్రీ పూ. 261 ప్రాంతంలో అతడు సామ్రాజ్య విస్తరణ దాహంతో కళింగ రాజ్యంపై దండెత్తాడు. అప్పుడు జరిగిన ఘోరయుద్ధంలో కళింగ సైన్యంలో లక్ష మంది హతులై, లక్షన్నరమంది ఖైదీలయ్యారు ఇంకా ఎందరో అమాయక ప్రజలు యుద్ధబాధ ననుభవించారు. ఈ దారుణ సంఘటన అశోకుని మనఃపరివర్తనకు కారణమైంది. అప్పటినుండి హింస ద్వారా కాక కరుణ ద్వారా మానవ హృదయాలను వశపరచుకోవలెననే బౌద్ధ ధర్మ దీక్షను వహించాడు. తాను బౌద్ధ దీక్షను వహించడమే కాక తన సామ్రాజ్యమంతటా ధర్మ ప్రచారం చేయించాడు. జంతువధను, మృగయా వినోదాన్ని నిషేధించి, ఇంకా ఎన్నో విధాల జీవకారుణ్య ధర్మాన్ని ప్రవర్తింప జేశాడు. సామ్రాజ్య మంతటా వేలకొలది శిలా స్తంభాలు నాటించి, వాటిపై బౌద్ధ ధర్మాన్ని వ్రాయించి ప్రచారం చేశాడు. ఇక తన సామ్రాజ్యం అవతలఉన్న చోళ, పాండ్య రాజ్యాలకు, సింహళానికి పశ్చిమానఉన్న రాజ్యాలకు, సిరియా, మాసిడోనియా, ఈజిప్టు మొదలైన దేశాలకు బౌద్ధ మత ప్రచారకులను పంపించాడు. క్రీ. పూ. 246 ప్రాంతంలో అశోకుడు పాటలీపుత్రంలో గొప్ప బౌద్ధపరిషత్తు (సంగీతి) ఏర్పాటుచేసి బౌద్ధమత ప్రచారానికి దోహదం చేశాడని చెబుతారు.

అశోకుని తరవాత బౌద్ధమతానికి ఎక్కువగా ప్రోత్సాహం లభించినది క్రీ. శ. 125 ప్రాంతంలో ఉత్తర భారతంలో చాల భాగాన్ని పాలించిన కనిష్కుని కాలంలో. ఇతడు కుషాన్ తెగవాడు. పెషావర్ రాజధానిగా ఇతడు రాజ్యంచేశాడు ఇతని కాలంలో నాలుగవ బౌద్ధపరిషత్తు జరిగింది. అశోకుని కాలపు పరిషత్తులో వెయ్యిమంది పాల్గొనగా, ఇతని కాలపు సమావేశంలో 500 మంది మాత్రమే పాల్గొన్నారట ఇతని కాలంలోనే మహాయాన బౌద్ధశాఖకు పునాదు లేర్పడ్డాయని చెబుతారు.

## ఆంధ్రదేశంలో

అశోకుని కాలంలోనే బౌద్ధమతం ఆంధ్ర ప్రాంతానికి వ్యాపించింది క్రీ పూ. మొదటి శతాబ్దంలో ఆంధ్రదేశం శాతవాహన చక్రవర్తుల పాలనలో అత్యుచ్ఛస్థితిని పొందింది ఆ కాలంలో బౌద్ధమతం సామాన్య ప్రజలలో విశేష ప్రచారం కలిగివుండేది. చక్రవర్తులుకూడా బౌద్ధమతాన్ని అమితంగా ఆదరించారు. వీరి ఆదరణలో ఆంధ్ర స్థూప నిర్మాణకళ, శిల్పకళ, చిత్రకళ బౌద్ధ ధర్మాన్ని ఆశ్రయించుకుని అత్యున్నత శిఖరాల కెగబ్రాకినవి. ఆంధ్ర సామ్రాజ్యం మధ్యభారత మంతటా విస్తరించుకుని ఉండేది. సాంచీ, అమరావతీ స్తూపాలు ఆ రోజులలో నిర్మితమైనవే జగత్ప్రసిద్ధమైన అజంతా చైత్యశిల్ప, చిత్రకళ ఆరోజులలోనే ప్రారంభమైంది. మహాయాన ప్రవర్తకుడైన నాగార్జునాచార్యుడు శాతవాహనుల సామ్రాజ్యంలో కృష్ణాతీరాన నివసించినవాడు. ఆనాడు కృష్ణానదీతీర ప్రాంతాలయున్న బౌద్ధ సంఘారామాలను దర్శించడానికి, దేశమంతటినుంచి, దేశాంతరాలనుండి బౌద్ధ మతానుయాయులు విరివిగా వచ్చేవారు.

దాదాపు మూడుశతాబ్దాలపాటు మహా సామ్రాజ్యాన్ని పరిపాలించిన ఆంధ్రచక్రవర్తుల అనంతరం, బౌద్ధమత ప్రాభవం క్రమంగా తగ్గిపో నారంభించింది. బౌద్ధమతంతోపాటుగా వైదికమతం మొదటినుండి దేశమంతటా వ్యాప్తిలో ఉన్నప్పటికీ క్రమంగా వైదికమతం బలపడసాగింది.

మళ్లీ క్రీ. శ. 606 సం॥ లో రాజ్యానికి వచ్చిన హర్షవర్ధనుని కాలంలో బౌద్ధమతా

నికి బాగా ప్రోత్సాహం లభించింది. హర్షుడు ఉత్తరభారతాన్నంతటినీ ఆక్రమించుకుని పెద్ద రాజ్యం పాలించాడు. ఇతడు బౌద్ధమతాన్ని బాగా ఆదరించినప్పటికీ వైదికమతాలనుకూడా అనుసరిస్తూనే ఉండేవాడు. చివరిరోజుల్లో పూర్తిగా బౌద్ధమతాన్నే స్వీకరించాడు.

## చైనా యాత్రికులు

హర్షునికాలంలోను, అంతకు ముందు శతాబ్దాలలోను బౌద్ధమత చరిత్రకు ముఖ్యాధారాలు చైనానుండి భారతవర్షం దర్శించవచ్చిన యాత్రికుల రచనలు.

వీరిలో మొదటివాడైన ఫాహియాన్ క్రీ. శ. 400 లో భారతదేశంవచ్చి పదమూడేళ్లపాటు దేశంలో పర్యటించాడు. ఇతని కాలానికి బౌద్ధ భిక్షువులతోపాటు వైదిక మతాచార్యులుకూడా సమానగౌరవం పొందుతూండేవారని తెలుస్తోంది. బౌద్ధమతంలోని ఉత్తమాంశాలను వైదికమతం స్వీకరించి, నెమ్మదిగా బౌద్ధమత క్షీణతకు కారణం కాసాగింది. అప్పుడు పరిపాలిస్తున్న చంద్రగుప్త విక్రమాదిత్యుని రాజ్యంలో బుద్ధుని జీవకారుణ్య ధర్మం మాత్రం తూచా తప్పకుండా అనుసరింపబడేదని కూడా తెలుస్తోంది.

చైనా యాత్రికులలో మరొక ముఖ్యమైన వ్యక్తి యువాన్ చ్వాంగ్. ఇతడు హర్షునికాలంలో భారతదేశంలో పర్యటించాడు. క్రీ శ. 629 లో తన ఇరవై ఆరవ ఏట ఇతడు చైనానుండి బయలుదేరాడు. బౌద్ధవిజ్ఞానాన్ని బౌద్ధజన్మస్థానమైన భారతదేశంలోనే గ్రహించవలెనని ఇతడు సంకల్పించాడు. కాని ఇతని ప్రయాణానికి చైనాచక్రవర్తి సమ్మతించలేదట. అప్పుడితడు మరికొందరు బౌద్ధసన్యాసులతో కలిసి దొంగతనంగా చైనానుండి బయలుదేరాడట. ఎన్నోకష్టాలుపడి గోబీరాజ్యాలు, తురుష్క రాజ్యాలు, అఫ్ఘనిస్థానం దాటి భారతదేశం ప్రవేశించాడు. ఇతని మార్గమధ్యంలో తారసిల్లిన దాదాపు అన్నిరాజ్యాలలోను బౌద్ధమతం రాజులనుండి, ప్రజలనుండి విశేషాదరణ పొందుతూ ఉండేది. భారతదేశంలో మాత్రం ఎక్కడచూసినా బౌద్ధమతం తిరోగమిస్తోందని, హిందూమతం పురోగమిస్తోందని యువాన్‌చ్వాంగ్ వ్రాశాడు. ఒకప్పుడు గొప్ప బౌద్ధకేంద్రమైన పాటలీపుత్రంలో వందలాది బౌద్ధారామాల శిథిలావశేషాలు మాత్రం మిగిలాయి. బౌద్ధచక్రవర్తులలో ఆఖరివాడైన హర్షుడు మహాయాన మతానుయాయి అయినా శివారాధన చేస్తూ ఉండేవాడు. హర్షుడు మహాయాన మతస్థులందరినీ కనోజ్ నగరంలో ఒకసారి సమావేశం చేశాడు. ఈ సభకు చైనాయాత్రికుణ్ణి



## ★ ఆసియాలో బౌద్ధమత ప్రాభవం ★

కూడా ఆహ్వానించాడు. చక్రవర్తికి మహాయాన మతంపైగల పక్షపాతం చూసి హీనయాన మతస్థులకు ఈర్ష్యకూడా కలిగిందట. హర్షుణ్ణి హత్యచేయడానికి కుట్రజరిగిందని, యువాన్‌చ్వాంగ్‌ను కూడా బ్రాహ్మణులు కొరించారనీ, దోషులైనవారిని హర్షుడు దేశంనుండి బహిష్కరించాడనీ కూడా చరిత్రవలన తెలుస్తోంది.

యువాన్‌చ్వాంగ్ భారతదేశంలో బౌద్ధక్షేత్రాలన్నీ దర్శించాడు. నలందా బౌద్ధవిహారంలో శీలభద్రుడనే బౌద్ధపండితునివద్ద చాలసంవత్సరాలు గడిపాడు. సంస్కృతం బాగా నేర్చుకున్నాడు. వెళ్లిపోయేటప్పుడు తనతో 600 సంస్కృత గ్రంథాలు, అనేక విగ్రహాలు తీసుకువెళ్లాడు. ఇతడు 645 లో స్వదేశానికి తిరిగివెళ్లినప్పుడు చక్రవర్తి తాయ్‌త్సుంగ్ గొప్ప స్వాగతమిచ్చి సత్కరించాడట.

యువాన్ చ్వాంగ్ తనతో తెచ్చిన సంస్కృత గ్రంథాలన్నిటినీ, ఇతరుల సహాయంతో చైనా భాషలోకి అనువదించాడు. ప్రజ్ఞాపారమిత సూత్ర గ్రంథాన్ని అనువదిస్తూ 664 సం॥ లో మరణించాడు.

యువాన్ చ్వాంగ్ సమకాలికుడైన ఈత్సింగ్ చైనీస్ యాత్రికులలో మరొక ముఖ్యమైన వ్యక్తి.

ఈత్సింగ్ తరువాత చైనానుండి భారతదేశానికి యాత్రికులు తగ్గిపోయారు. నేల మార్గాన రావటం ప్రమాద భరితంగా తయారైంది. సముద్ర మార్గాన రావడానికి కొందరు ప్రయత్నించారుగాని అదీ సఫలం కాలేదు. అదీగాక బౌద్ధ విజ్ఞానంకోసం భారత దేశానికి రావలసిన అవసరం కూడా చైనీయులకు కనపడలేదు. భారత దేశంలో బౌద్ధమతం నశించి పోసాగింది. అందుచేత చైనీయులు సింహళానికి, అన్నామ్, కంబో

పంచఫణా ఫణిశయ్యపై నాగరాజు, నాగరాణి. స్వర్లోకవాహిని మందాకిని ముందుభాగంలో ఉన్నది. సాంచీ స్తూపం 5వ ద్వారంపై శిల్పం.



సాంచీ తూర్పుద్వారంపై యక్షిణీశిల్పం. క్రీ. పూ. 1 శతాబ్ద శిల్పపు విన్నాణాని చక్కని తార్కాణం.

(సాంచీ ఫోటోలు బర్మాషెల్ సౌజన్యంతో)



డియా, జావాలకు యాత్రలుచేయ సాగించారు. అప్పటికి ఆ దేశాలలో పాళీ, సంస్కృత భాషావేత్తలు అనేకులు తయారై, బౌద్ధమత గ్రంథాలు అనేకం అక్కడే లభ్యమయ్యేవి.

## బౌద్ధమత పతనం

ఎనిమిది, తొమ్మిదవ శతాబ్దాలనుండి బౌద్ధమతం భారతదేశంలో అక్కడక్కడ నాగరువాటుగా నిలిచిందేగాని, పూర్వ ప్రాభవాన్ని మళ్ళీ అందుకోలేకపోయింది. హిందూమతం ఎనిమిదవ శతాబ్దంనుండి క్రొత్త ఉత్సాహంతో పురోగమించ సాగింది. అద్వైత వేదాంత ప్రవర్తకుడైన శంకరాచార్యుడు (788 సం॥ ప్రాంతం) బౌద్ధ మతాన్ని పూర్తిగా ఖండించి వైదిక మతాన్ని పునః ప్రతిష్ఠించాడు.

బౌద్ధమతం మన దేశంలో క్షీణించి పోవడానికి అనేకులు అనేక రకాలుగా కారణాలు చెబుతున్నారు. వైదిక మతానుయాయులు బౌద్ధులను హింసించి అణచివేశారని ఒక ప్రవాద ఉన్నదిగాని అది అంత నమ్మదగినదిగా కనబడదని చరిత్రకారులు కొట్టివేశారు. బౌద్ధమత క్షీణతకు ఆమతం వేసిన వెర్రితలలే కారణమని చరిత్రకారులు విశ్వసిస్తున్నారు. బుద్ధుడు ఉపదేశించిన ధర్మం పోనుపోను అనేక శాఖోపశాఖలుగా చీలిపోయి, హిందూమతంనుండి అనేక సిద్ధాంతాలను కలుపుకుని చివరికి రూపుమారిపోయింది. హిందూమతంకూడా బౌద్ధమతంలోని ఉత్కృష్టధర్మాలను స్వీకరించి బలపడింది. హిందూమతానికి జీవగర్ర ఈశ్వరునిలోను, ఆత్మలోనుగల విశ్వాసం. ఇందుకు వ్యతిరిక్తంగా ఉన్న బౌద్ధసిద్ధాంతాలను ప్రజలు తిరస్కరించారు. సింహళం నుండి వచ్చిన ఒక బౌద్ధుడు "విజ్ఞానం క్షణిక

# ★ ఆసియాలో బౌద్ధమత ప్రాభవం ★

మైనది; అనిత్యమైనది" అని ప్రతిపాదించగా శైవుడొకడు 'నీ మాటలు ముగియక మునుపే వాటిలోని భావం అంతరించినప్పుడు, వాటికెలా నమ్మడం?" అని సమాధానమిచ్చాడట. దీనికి బౌద్ధుడు ప్రత్యుత్తరం ఇవ్వలేక మౌనం వహించాడట. ఈ రీతిగా బౌద్ధసిద్ధాంతాలన్నీ వైదిక అద్వైత సిద్ధాంతాలముందు నిలబడలేకపోయాయి.

## తాంత్రికవాదం

బౌద్ధమతశాఖలలో తాంత్రికవాదులదొక శాఖ. ఈశాఖ ఆరవశతాబ్దంలో తలఎత్తింది. తాంత్రికవాదులు మద్య, మాంస, మైథునాది హీనాచారాలను అవలంబించి బౌద్ధమత ప్రతిష్ఠను అడుగంటించారు. బుద్ధుడు తన 'వజ్రకాయం'తో తార అనే శక్తిని నిరంతరాలింగనం చేసుకుని ఉంటాడని, బౌద్ధ ఉపాసకుడు కూడా అదేవిధంగా స్త్రీతో సంగమించాలనీ వీరు హేయ సిద్ధాంతాలు లేవదీశారు.

ఆయా కారణాలవల్ల బౌద్ధమతం జన్మదేశమైన భారతదేశంలో అంతరించిపోయింది. అంతరించిపోయినప్పటికీ, భారతీయ మత, వేదాంతాలపై, సారస్వత, చిత్రలేఖన, శిల్ప, ఆలయ నిర్మాణాది కళలపై, భారతీయ జీవనవిధానంపై ఎన్నటికీ మాయని మహత్తర ప్రభావాన్ని ముద్రించి మరీ అంతరించింది. ఈనాటికీ శాక్యముని ప్రబోధించిన మానవవాదం భారతీయ సంస్కృతిలో, దృక్పథంలో అంతర్వాహినిగా ప్రవర్తిల్లుతూనే ఉంది.

## ఇతర దేశాలలో

సింహళం, ఇండోనేషియా, ఇండోచైనా, బర్మా, సయాం, జపాన్, కొరియా, చైనా, టిబెట్, నేపాల్ మొదలైన దేశాలన్నిటా బౌద్ధమత సందేశం ప్రతిధ్వనించి, అసంఖ్యాక ప్రజలను ధర్మ మార్గావలంబులను చేసింది. ఆగ్నేయాసియా దేశాలకు నాగరికతా భిక్ష ప్రసాదించింది. అపూర్వ కళాసృష్టికి కారణభూతమైంది. సంఖ్యాదృష్ట్యా చూస్తే ఇప్పటికీ సుమారు 50 కోట్లమంది బౌద్ధ మతానుయాయులున్నారు. క్రైస్తవ మహమ్మదీయ మతాలవలెనే ఇది కూడా అంతర్జాతీయ మతమని చెప్పవచ్చును.

## జపాన్

జపాన్ దేశంలో బౌద్ధమతం షింటో, కన్ఫ్యూషియస్ మతాలతో కలిసిమెలిసి అభివృద్ధి అయి, క్రమంగా అక్కడి ప్రధాన మతమైంది. జపానీస్ సంస్కృతి, నాగరికత, కళ, విద్యావిధానం అన్నీ బౌద్ధమతానికి చాలా ఋణపడి ఉన్నాయి.

క్రీ. శ. 550 ప్రాంతంలో కొరియా రాజు జపాన్ చక్రవర్తికి ఒక స్వర్ణ బుద్ధ విగ్రహం, కొన్ని గ్రంథాలు, కానుకగా పంపిస్తూ, ఈ మతం ఆనందదాయకమైనదనీ మానవుడు వాంఛించే సకల సుఖ సంపదలను చేకూరుస్తుందనీ సందేశం పంపించాడట. జపాన్ చక్రవర్తి బౌద్ధమతం స్వీకరించాడు. కాని ప్రజలు, సామంతరాజులు ఆ మతాన్ని నిరసించారు. తత్ఫలితంగా అంతర్యుద్ధము సంభవించి, 587 సం॥ వరకూ కొనసాగింది.

క్రమంగా బౌద్ధ భిక్షువులు రాజమార్గాల ద్వారా ప్రజలను తమ మతంవైపు ఆకర్షించ గలిగారు. షింటో దేవతలందరూ బుద్ధులేనని, జపానీస్ సూర్యదేవత వైరోచన బుద్ధుని అవతారమేనని ప్రజలకు నచ్చచెప్పారు. మహాయాన బౌద్ధానికి సంబంధించిన గొప్ప దేవాలయాలు, ఉత్సవాలు, ఊరేగింపులు, మంత్ర తంత్రాలు, ధూపదీప నైవేద్యాలు, ప్రార్థనలు ఇవన్నీ జపాను ప్రజలకు ఎంతో ఆకర్షవంతంగా కనబడి వారిని వశపరచుకో గలిగాయి. అదీగాక సహేతుకమైన తత్వశాస్త్రం, ధర్మసూత్రములు కలిగిన బౌద్ధమతం జపానీయుల షింటో మతం కంటె స్వతహాగా ఉన్నత స్థాయికి చెందినది. అందుచేత వారిని సులభంగా లోబరుచుకో గలిగింది. జపాన్‌లో మహాయాన బౌద్ధానికి కొత్త కొత్త శాఖలు ఏర్పడినవి. ఈనాడు మహాయానానికి జపాన్ దేశమే నాయక దేశంగా పరిగణింపబడుతూవుంది.

షోమూ అనే జపాన్ చక్రవర్తి ఎనిమిదవ శతాబ్దంలో గొప్ప బుద్ధ విగ్రహాన్ని నిర్మించాలని సంకల్పించాడు.

ఈ విగ్రహనిర్మాణానికి ప్రజలు స్వచ్ఛందంగా ఎంతో ధనం సహాయం చేశారు. 752 వ సం॥లో ఈ విగ్రహం పూర్తయింది. జపాన్ ప్రాచీన రాజధాని 'నారా' వద్ద ఉన్న ఈ ఉపవిష్ట బుద్ధవిగ్రహం ఎత్తు 55½ అడుగులు. ముఖం ఒకటే 16 అడుగుల పొడుగున ఉంటుంది. 500 టన్నుల రాగి, 750 పౌనుల బంగారం ఈ విగ్రహానికి పట్టిందట.

1868 సం॥లో జపాన్ ప్రభుత్వం పాశ్చాత్య నాగరికతా ప్రభావానికి లోనై బౌద్ధమతాన్ని నిరాదరించ నారంభించినప్పటికీ 1888, 89 సం॥ నుండీ తిరిగి బౌద్ధమతాన్ని ఆదరిస్తోంది. ఇప్పుడు సంఘసేవా కార్యక్రమా లెన్నిటినో బౌద్ధమత సంస్థలు నిర్వహిస్తున్నాయి. జపాన్‌లో నాలుగున్నర కోట్లమంది బౌద్ధులున్నారు. వీరిది మహాయాన శాఖ. ఈ శాఖలో మళ్ళీ అనేక ఉపశాఖలున్నాయి. షిన్‌షూ బౌద్ధులు అమితాభ బుద్ధుణ్ణి, క్వానొయిన్ దేవతను ఆరాధిస్తారు. గౌతమబుద్ధుని జన్మదినాన్ని పరమ పవిత్రంగా ఎంచుతారు. గౌతముణ్ణి వీరు శాక్యముని అంటారు.

జెన్ శాఖ బౌద్ధులు వేరే ఉన్నారు. శాక్యముని దగ్గర కొకసారి ఒక శిష్యుడు స్వర్ణ పద్మాన్ని కానుకగా తీసుకువచ్చి ధర్మోపదేశం చెయ్యమని కోరాడట. శాక్యముని ఆ పద్మాన్ని చేత ధరించి దానివంక మౌనంగా చూస్తూ ఉండిపోయాడట. ధర్మరహస్యం అనిర్వచనీయమనీ, ధ్యానం ద్వారానే ధర్మం తెలిసికోదగిందనీ గౌతముని భావం. ఇది ఆధారంగా జెన్ అనబడే బౌద్ధం చైనాలో మొదటగా బయలుదేరి అక్కడనుండి 12 వ శతాబ్దంలో జపాన్‌కు వ్యాపించింది. తత్త్వాన్వేషణ ద్వారాగాని, పారాయణం వలనగాని సంబుద్ధి సిద్ధించనేరదని, ధ్యానయోగంలోనే సిద్ధిస్తుందనీ జెన్ బౌద్ధులు విశ్వసిస్తారు. ఈ శాఖవారిప్పటికీ జపాన్‌లో 90 లక్షలమంది ఉన్నారు.

## చైనా

క్రీ. శ. నాలుగవ శతాబ్దంవరకూ చైనాలో బౌద్ధభిక్షువులు కావడానికి ఎవరికీ అనుమతి లభించేది కాదట. ఆరవ శతాబ్దారంభంలో భారతీయ బౌద్ధతత్త్వవేత్త బోధిధర్ముడు చైనా దేశం వెళ్లి అక్కడే స్థిరపడిపోయి,

చైనా దేశాన్ని బౌద్ధ విజ్ఞానానికి ముఖ్య కేంద్రంగా చేశారు.

చైనా చరిత్ర క్రీ. పూ. 2856 నుండి ప్రారంభమైనది. బౌద్ధమతం ప్రవేశించడానికి ముందే వారికి గొప్పనాగరికత, సంస్కృతి, తావ్ మతము, కన్ఫ్యూషియన్ మతము ఉన్నాయి. ఈమతాలను బౌద్ధమతం జయించలేకపోయింది. వాటితోపాటు ప్రక్క ప్రక్కనే అభివృద్ధి అయింది. సంఖ్యా దృష్ట్యా చూస్తే దాదాపు మూడవవంతు ప్రజలు బౌద్ధమతానుయాయులైనా, వీరు మిగతా రెండు మతాల విశ్వాసాలనుకూడా తమ మతంలోకి చేర్చుకున్నారు. చైనాలో బౌద్ధమతం ఎక్కువగా సంఘారామాలకే పరిమితమై ఉండేది. సామాన్య ప్రజల జీవితంలో అది ఎక్కువగా ఇమిడిపోలేదు. బౌద్ధభిక్షువులను 'దేశపటులోని పోమరి ఈగలు' గాను, 'పట్టు పురుగులంతైనా ఉపయోగం లేనివారు' గాను వీరు భావిస్తారు. ఏది ఏమైనా బౌద్ధమతం చైనీస్ సారస్వత, చిత్రలేఖనాది కళలకు ఎంతో దోహదం చేసిందనేది నిర్వివాదాంశం. చైనా చరిత్రలో గణుతికెక్కిన చిత్రకారులనేకులు బౌద్ధకథలాధారంగా గొప్పగొప్ప చిత్రాలు రచించారు. ముఖ్యంగా తాంగ్ వంశ పరిపాలన కాలంలో బౌద్ధమతం అత్యున్నత స్థితి పొందింది.

## టిబెట్

టిబెట్‌లో బౌద్ధమతం ఇతర దేశాలలో కంటె భిన్నమైనది. సాధారణంగా బౌద్ధమతంలో పూజారులుండరు. భిక్షు సంఘాలు మాత్రమే ఉంటాయి. కాని టిబెట్‌లో మత కర్మకాండ యావత్తూ జరిపించే పూజారులుంటారు. వీరిని 'లామా' లంటారు. ఈ లామాలందరికీ అధిపతి దలైలామా. ఇతడు 'లాసా' నగరంలో ఉంటాడు. దలైలామా అవలోకితేశ్వరుని అవతారమని టిబెటన్లు విశ్వసిస్తారు. ఒక దలైలామా చనిపోయినప్పుడు, అవలోకితేశ్వరుడు మళ్ళీ ఏదో సామాన్య కుటుంబంలో జన్మిస్తాడు. లామాలు ఆ శిశువును అన్వేషించి తీసుకువచ్చి మళ్ళీ సింహాసనంమీద కూర్చుండబెడతారు. సాధారణంగా దలైలామా బాల్యంలోనే చనిపోతూ ఉంటాడు.

అదివరకే టిబెట్‌లో బౌద్ధమతం కొద్దిగా వ్యాపించినప్పటికీ క్రీ. శ. 750 లో పద్మసంభవుడనే భారతీయ బౌద్ధుడు టిబెట్ వెళ్ళి అక్కడ తాంత్రిక మహాయానాన్ని స్థాపించాడు. టిబెటన్ తాంత్రిక బౌద్ధం బహుచిత్రమైనది. ఆదిబుద్ధుని అంశం నుండి అనేకమంది బుద్ధులు ప్రతి కల్పంలోనూ జన్మిస్తారు. ఈ బుద్ధులందరిలోకీ గొప్పవాడు అమితాభ బుద్ధుడు. బుద్ధుల తరవాత బోధిసత్వులు. వీరిలో కల్లా అవలోకితేశ్వరుడనే పద్మపాణి బోధిసత్వుడు గొప్పవాడు. మంజుశ్రీ, వజ్రపాణి మొదలైన బోధిసత్వులు ఇంకా పలువురుంటారు. మహామేరువుపై ఉండే స్వర్గాన్ని నాలుగు ద్వారాల నుండీ కాపలాకాసే ధృతరాష్ట్రుడు, విరూపాక్షుడు, విరూఢకుడు, వైశ్రవణుడు అనే ద్వార దేవతలనుకూడా టిబెటన్లు కొలుస్తారు. గౌతమబుద్ధుని శిష్యులైన మౌద్గల్యాయన, శారిపుత్ర, కాశ్యప, ఆనందులను, అశ్వఘోష, నాగార్జున, పద్మసంభవాది అర్హతులను కూడా వీరు ఆరాధిస్తారు.

బౌద్ధమతం అనాగరికమైన టిబెట్ దేశాన్ని నాగరికం చేసింది. ★




# బౌద్ధమతంలో స్త్రీల ప్రతిపత్తి

ఇల్లిందల సరస్వతీదేవి

గౌతమబుద్ధుడు జన్మించి, జీవించి, నిర్వాణమందిన భారత దేశములోను, బౌద్ధ మతాభిమానముగల బర్మా, చైనా, ఇండోచైనా, జపాన్, జావా, సుమత్రా మొదలయిన ఇతర దేశాలలోను ఈ వైశాఖ పూర్ణిమకి శ్రీ బుద్ధజయంత్యుత్సవాలు మహా వైభవముగా జరుగనున్నాయి. వైశాఖ పూర్ణిమ నాటికి అనగా మే నెల 24 వ తేదీకి గౌతమసిద్ధార్థుడు నిర్వాణంపొంది 2500 సంవత్సరాల కాలమయినదని చారిత్రికులు నిర్ణయించారు. వీరాధివీరులూ లోకోద్ధారకులూ జన్మించిన పుణ్య భారత దేశములో, గౌతమబుద్ధుడు క్రీస్తుకు పూర్వము 563 లో ఉద్భవించాడు; క్రీస్తుకు పూర్వము 483 లో నిర్వాణ మందినాడు. ఆయన జీవితకాలము 80 సంవత్సరాలు. సరిగా 29 వ ఏట, తొలి యౌవనారంభమున భార్యా పుత్రులను రాజ్యాన్ని విడిచి, సర్వసంగ పరిత్యాగము చేసి, ధర్మతత్వాన్వేషణ గావించి, ఆశయసిద్ధి పొందిన పురుషోత్తముడు గౌతమ బుద్ధుడు. శ్రీబుద్ధదేవుని పరిశుద్ధజ్ఞానప్రభావము చేత మానవసంఘం సత్యపథాన్ని సమీపించ గలిగింది. శ్రీ బుద్ధాచార్యుడు దార్శనికత్వానికీ, పాండిత్యానికీ స్వయంకర్తవ్య క్షేత్రమున స్థానమొసంగక, సర్వజన గ్రాహ్యమయిన ఆత్మీయ తత్వముయొక్క వ్యాఖ్యానము గావించటము చేత, మానవాంతఃకరణ, బుద్ధి, విచారణశక్తి నిస్సంకోచ భావముతో ఆ ప్రబోధానికి శిరము వంచింది. ఈ కారణముచేత బౌద్ధధర్మము సాంఘిక విప్లవానికి అవకాశ మివ్వక అల్పకాలములోనే ఆసియా ఖండమం దంతటా వ్యాపించి పోయింది. బౌద్ధమత స్వీకారము చేసినవారిలో స్త్రీలుకూడా ఉన్నారు. బౌద్ధమతము ఆ కాలపు సనాతన హిందూ సంఘములో స్త్రీల సాంఘిక ప్రతిపత్తిలో కొంత మార్పు తేగలిగింది.

ప్రాచీన భారతములో మానవసేవకు బద్ధకంకణలయిన స్త్రీలు బౌద్ధ మతములో తప్ప మనకు కనబడరు. స్త్రీలు సదా ఇతరుల అధీనములో ఉండటమే హైందవుల ఆదర్శము కనుక, స్వతంత్రంగా ముందుకు వచ్చి, తమ ఆశయాలను సాధించిన ఉదాహరణలు ప్రాచీన భారతములో తక్కువ. ఆ కాలములో స్త్రీలు పండితులు కావచ్చు—కవయిత్రులు కావచ్చు—మైత్రేయి వలె బ్రహ్మవాదినులు కావచ్చు - కాని సంఘములో తమ మేధాశక్తినీ ప్రతిభనూ చాటటము ఆదర్శముగా భావింపబడలేదు. స్త్రీ ప్రతిభ పత్నిగా మాతగా భర్తచాటున, కుమారునిచాటున ప్రకాశించిన ఆదర్శాలు తప్ప స్వతంత్రముగా స్త్రీలు తమ శక్తిని ప్రదర్శించిన ఉదాహరణలు తక్కువ.

కాని బౌద్ధమతములో స్త్రీల సాంఘిక ప్రతిపత్తిలో కొంతవరకూ మార్పు కలగటానికి అవకాశము ఏర్పడ్డది. 'పురుషుడివలెనే స్త్రీ తన కర్మకు తానే బాధ్యురాలు. మోక్షముగానీ నరకముగానీ ఆమె కర్మననుసరించి ప్రాప్తించగలిగినదే కాని, తల్లిదండ్రులూ, గురువులూ తోడ్పడలేరు. ఎవరి కర్మకు వారే బాధ్యులు. కనుక కుమారుడు తల్లిని నరకమునుండి తప్పించటమన్నది లేదు.' అని బౌద్ధము బోధించినందువల్ల కుటుంబములో మగబిడ్డ పుట్టినప్పుడు ఆనందించటమూ, ఆడబిడ్డ పుట్టినప్పుడు విచారపడటమూ తగ్గినది. క్రమముగా కుటుంబములోనూ సంఘములోనూ ఆడపిల్ల ప్రతిపత్తి పెరుగుతూ వచ్చింది.

క్రతుకలాపాలలో హిందూ ధర్మశాస్త్రాన్ననుసరించి వితంతువులకు, పుత్రులు లేని

స్త్రీలకు, సంతానములేని స్త్రీలకూ పాల్గొనే అధికారము లేదు. బౌద్ధమతము ఈ విధమైన బ్రాహ్మణ కర్మలను నిషేధించినందువల్ల, వితంతువులను, సంతానములేని స్త్రీలను సంఘములోను కుటుంబములోను లోకువగా చూసే అవకాశము తగ్గిపోయింది.

హిందూమతములో ఆధ్యాత్మికరంగములో పురుషునితో సమానముగా స్త్రీకి స్థానములేదు. కొన్ని కర్మలు, మంత్రాలు స్త్రీలకు నిషేధింపబడ్డాయి. కాని—బౌద్ధమతము ఆధ్యాత్మికరంగములో స్త్రీ పురుషులకు భేదము చూపలేదు. స్త్రీ పురుషులిద్దరూ ఈ రంగంలో తమ ప్రయోజనాలనూ ఆశయాలనూ సాధించుకోవటానికి అవకాశము ఉన్నది. కనుకనే బౌద్ధమతములో స్త్రీ పురుషులు సమానముగా కృషిచేయగలిగారు. ఎంతోమంది స్త్రీలు ఈ మతసూత్రాల ననుసరించి తాము కోరిన పరమ ప్రయోజనాన్ని (జన్మరాహిత్యము) సాధించినట్లుగా ఉదాహరణలు ఉన్నాయి.

బౌద్ధధర్మము కుటుంబములోని స్త్రీ పురుషులను సన్యాసాశ్రమము స్వీకరించవలసినదని శాసించలేదు. సన్యాసాన్ని హృదయపూర్వకముగా ఆహ్వానించినప్పటికీ, గృహస్థాశ్రమాన్ని కూడా సమ్మానించింది. బుద్ధభగవానుని ధర్మసిద్ధాంతాలలో గృహస్థాశ్రమ వాసుల ప్రయోజనార్థము వ్రాయబడిన ధర్మోపదేశాలు అనేకముగా వున్నాయి.

"ఓ గృహిణులారా! మీ రాత్రియందు నికేతనములను శుభోజ్వల ప్రకాశముచే ప్రదీప్తములు కావించుడు. గృహములను చతుర్దిక్కుల నుండి మంగళ పరంపరలచే సురక్షితములు గావించుడు. సత్యశూన్యములైన, బాహ్య కర్మకలాపములచే మీ సదనము లెంతమాత్రము రక్షింపబడజాలవని గుర్తెరుగుడు" అని బౌద్ధము ప్రబోధిస్తున్నది.

బౌద్ధ సంఘములో భిక్షుణులుగా చేరటానికి స్త్రీలందరికీ అధికారము ఉన్నది. వివాహితలూ అవివాహితలూ చేరవచ్చు. సంతానవతులు, నిస్సంతులు, వితంతువులూ పతితురాండ్రూ చేరవచ్చు. పతితలను నిరసించటమూ, బహిష్కరించటమూ బుద్ధుని మతముకాదు. వారిని ఆదరించి, సానుభూతి చూపి, వారిలోవున్న కల్మలాన్ని క్షాళితము చేసి, ఆత్మసంస్కారము కలిగించటమే ఆ మతము తలపెట్టిన పరమ ప్రయోజనము. ఈ దృష్టితోనే బుద్ధభగవానుడు ఆమ్రపాలి అను గణిక ఆతిథ్యాన్ని స్వీకరించగలిగాడు; బౌద్ధసంఘానికై ఆమె దానము చేసిన మామిడితోటను గ్రహించగలిగాడు.

విద్యార్థులలో కూడా స్త్రీ పురుష భేదము లేదు. విద్య, బౌద్ధమత సిద్ధాంతాలూ వారికి సమానముగా బోధింపబడేవి.

బౌద్ధసంఘములో స్త్రీ పురుషులను సమానముగా పరిగణించి, హిందూమతములో కంటే స్త్రీల ప్రతిపత్తిని అభివృద్ధిపరచినప్పటికీ, స్త్రీపురుషుల సమాన ప్రతిపత్తికి కొన్ని ఆటంకాలు కలిగేవి. దానికి స్త్రీల శరీర దౌర్బల్యమే కొంతవరకూ కారణమని ఊహింపబడ్డది.

బౌద్ధమతములో చేరిన గృహిణులను ఉపాసికలనీ, సన్యాసినులను భిక్షుణులనీ వ్యవహరిస్తారు. వారందరూ విధిగా పంచశీలము లాచరించవలసినదే. నైష్ఠికులు అష్టశీలము లాచరించవలసి ఉంటుంది. గృహస్థులు భిక్షువులు కాబోవునప్పుడు శరణత్రయాన్ని (బుద్ధం శరణం గచ్ఛామి. ధర్మం శరణం గచ్ఛామి. సంఘం శరణం గచ్ఛామి. దీనికి బౌద్ధరత్నత్రయమని కూడా అంటారు) పొందవలసి ఉంటుంది. భిక్షువులు భవబంధాల నన్నిటిని విడనాడవలసి ఉంటుంది. అలంకారాలను కోరరాదు. శరీరము కప్పుకోవటానికి కాషాయాంబరాన్ని ధరించాలి. కేవలము శరీరాన్ని నిలుపుకోవటానికే భుజించాలి. తృష్ణను విసర్జించాలి. అకాలములో భిక్షకు పోరాదు. పరులకథలు ఇతరులతో ప్రస్తావించరాదు. సర్వదా జీవకారుణ్యము కలిగిఉండాలి. బ్రహ్మచర్యదీక్ష నవలంబించాలి. దశశీలము లాచరించాలి. ఆహార నియమాలను పాటించాలి.

స్త్రీలను బౌద్ధమతములో భిక్షుణులుగా చేర్చుకోవటానికి మొదట గౌతమబుద్ధుడు అంగీకరించలేదు. 'ఎవరి కర్మకు వారే బాధ్యులు. ఎవరి మోక్షానికి వారే యత్నించాలి' అన్న ప్రాథమిక సూత్రాన్ననుసరించి తప్పనిసరిగా స్త్రీలను చేర్చుకోవలసి వచ్చినది. భిక్షుణిలుగా బౌద్ధమత స్వీకారము చేసిన స్త్రీలలో మహాప్రజాపతి గౌతమీదేవి ప్రథమురాలు. ఈమె సుభూతుని పుత్రిక. సిద్ధార్థుని కన్నతల్లి మాయాదేవి కీమె సోదరి; సపత్ని. మాతృవిహీనుడయిన సిద్ధార్థుని కన్నబిడ్డవలె పెంచినది. మాయాదేవి మరణానంతరము ఈమె పట్టపురాణి అయినది. ఈమెకు నందుడను కుమారుడూ, సుందరీనంద అను కుమార్తె కలిగారు. వారి విద్దరినీ దాదులకు ఒప్పగించి సిద్ధార్థుని పెంచినది. గౌతముడు బుద్ధుడయిన తరువాత, సవతి తమ్ముడయిన నందుడినీ, పుత్రుడయిన రాహులుడినీ మతములో చేర్చుకొన్నాడు. శుద్ధోదనుని మరణానంతరము దేశములో అరాజకము ప్రబలినది. పొరుగు రాజ్యముతో యుద్ధము ప్రారంభమయినది. ఆ కల్లోల పరిస్థితులలో మరణించిన వీరుల భార్యలతో, గౌతమీదేవి బౌద్ధధర్మ దీక్షను స్వీకరించవలెనని బయలుదేరింది. బుద్ధుడప్పుడు వైశాలీ నగరములో ఉన్నాడు. స్త్రీలను చేర్చుకోవటాని గౌతము డంగ

# బంగారు నెమలి

నాటిరాత్రి క్షేమారాణి హంస తూలికా తల్పంపై శయనించి హాయిగా నిద్రపోయింది. అటు పిమ్మట కొంతసేపటికి ఆమె సోగ కనురెప్పలపై ఒక బంగారు నెమలి పింఛం తళతళా మెరిసినట్లయింది. 'ఆహా! ఎంత సొగసైన పైడి నెమలి' అని ఒళ్ళంతా కళ్ళు చేసుకొని ఆ మహారాణి అదేపనిగా ఆ సువర్ణ మయూరం సౌందర్యంలో తన్మయమైంది. పిమ్మట ఆ నెమలి ఆమెకేదో ధర్మబోధ చేస్తున్నట్లుకూడా వినిపించింది. ఆనందబాష్పాలు జాలువారగా ఆమె ఆ ధర్మబోధామృతం ఆస్వాదించింది.

మళ్ళీ కళ్ళు తెరిచి చూచింది. పైడి నెమలి అంతలోనే అదృశ్యమైపోయింది. మరునాడామె మహారాజుతో తన కల సంగతి చెప్పి బంగారు నెమలి కావాలని కోరింది. బంగారు నెమళ్ళెక్కడైనా ఉంటాయా? అని మహారాజనేక విధాలుగా మథనపడ్డాడు. అయితే కొందరు బోయవాళ్ళటువంటి నెమళ్ళుండేమాట వాస్తవమేననీ, అవి హిమాలయ ప్రాంతంలో దండక పర్వతం చరియలపై నివసిస్తుంటాయనీ నచ్చచెప్పారు.

వెనువెంటనే మహారాజొక బోయవాణ్ణి పిలిచి హిమాచల ప్రాంతానికి పంపించాడు. వాడతి కష్టంమీద బంగారు నెమలి ఉన్నచోటు కనిపెట్టి, దాన్ని పట్టుకోడానికి వలలుపన్ని ఆ సమీపంలోనే ఒకచోట పొంచి కూర్చున్నాడు. నెమలి తెల్లతెల్లవారేవేళ వలలు పన్నినచోటే పురివిప్పి ఆడింది. ఇక నెమలిని పట్టుకోవచ్చునని బోయవాడెంతైనా సంబరపడ్డాడు. పైడి నెమలి వలలో చిక్కుకొని కొంతసేపు విలవిలా తన్నుకుంది. అయితే వెంటనే అది ఈ విధంగా సూర్యోపస్థాన మంత్రం పునశ్చరణ చేసింది.

'శ్రీ'

పద్మినీప్రియ, లోకబాంధవా,
సకలేశ!
"రక్షింపవే, రాగశృంఖలముల
నుండి!
అసుర సంహారకారక,
సప్తాశ్వ
సముద్ధరవే, ప్రభాసహిత
ధామమునుండి!"

నెమలి అటుపిమ్మట వెంటనే వలలోనించి తప్పించుకొని, దండక పర్వత శిఖరంపైకెక్కి హాయిగా పురివిప్పి నాట్యం చేసింది. తరవాత బోయవాడెన్నిమారులు ప్రయత్నించినా మరి బంగారు నెమలి దొరకలేదు!

పాపం క్షేమారాణి తనకా నెమలి దొరకలేదనే వేదనతోనే కుమిలి కృశించి కాలధర్మం చేసింది. ఆమె భర్త వారాణాసీ రాజ్యాధిపతి. ఎంతటి ప్రాభవాధికారాలున్నా ఒక నెమలిని చేజిక్కించుకోవడానికి కూడా అవి కొరగాలేదనే వేదనతో దిగాలుపడిపోయి అతడు కూడా మరికొంత కాలానికి కాలధర్మం చేశాడు.

మరణించేముందు దండకపర్వత శిఖరంపై ఒక శాసనం ప్రతిష్ఠింపచేశాడు. పైడి నెమలి మాంసం భక్షించినవారజరామరులు కాగలరనీ, అది మానవులవశ్యం భుజింపదగిన మాంసమనీ ఆ శాసనంపై చెక్కించాడు.

అనంతరం వారాణాసీ రాజ్యంలో ఆరుగురు రాజన్యులు పరిపాలించారు. అయితే వారెవరు బంగారు నెమలిని పట్టుకోలేకపోయారు. ఏడవ మహారాజది తన వంశానికి పెద్ద కళంకమనీ, వెంటనే అది తొలగించివెయ్యాలనీ నిశ్చయించి నెమలి వేటలో నిపుణుడైన ఒక బోయవాణ్ణి హిమాలయానికి పంపించాడు.

బోయ తనతో ఒక ఆడునెమలిని కూడా తీసుకువెళ్ళాడు. సువర్ణ మయూరం తిరిగే ప్రదేశంలో



బుద్ధజన్మకు పూర్వం బోధి సత్వుడు వెస్సంతరుడనే రాజకుమారుడుగా జన్మించాడు. వెస్సంతరుడు గొప్ప దానశీలి. అతనివద్ద ఒక తెల్లఏనుగు ఉన్నది. అది ఎక్కడ ఉంటే అక్కడ కరువు కాటకాలుండవు. కళింగదేశంలో ఒకసారి దుర్భిక్షం రాగా, కళింగబ్రాహ్మణులు కొందరు వచ్చి ఆ శ్వేతగజాన్ని దానం అడుగుతారు. వెస్సంతరుడు ఆ ఏనుగును దానం చేస్తాడు. ప్రజలకు ఈ దానం ఇష్టం

## బంగారు నెమలి ★

వలలు పన్ని అక్కడే ఆడునెమలి నృత్యం చేసేటట్లు ఏర్పాటు చేశాడు. ఆడునెమలి కన్నుల పండుగా నృత్యం చేసి బంగారు నెమలి హృదయం పులకరించేటట్టుగా కేకా ధ్వనులు విసిరింది. పాపం పైడి నెమలి ఆ మధుర ధ్వనులు విని నెమ్మదిగా అక్కడికి వచ్చి, ఆ వలలో చిక్కుకుపోయింది. అది చూచి ఆడనెమలి ఇంకా సొగసుగా నృత్యం చేసింది. స్వర్ణమయూరం ఆ నృత్యతన్మయతలో సూర్యోపస్థాన మంత్రం పునశ్చరణ చెయ్యడమే మరిచిపోయింది. కొంతసేపటికసలా మంత్రమే మరిచిపోయింది.

సమయం కనిపెట్టి బోయవాడు బంగారు నెమలిని పట్టుకొని కాశీ నగరానికి తీసుకుపోయాడు. కాశీ మహారాజు దానిని చూచి ఇన్నాళ్లకు తమ పూర్వుల కోరిక నెరవేరిందిగదా అని ఎంతో సంతోషించాడు.

"మహారాజా, మీరు నన్నెందుకిలా బంధింపజేశారు?" అని అడిగింది సువర్ణమయూరం.

"నీ మాంసం తిన్నవారికి ముసలితనము, చావు రావని తెలిసింది. కనకనే నిన్ను పట్టించాను." అన్నాడు కాశీరాజు. "నేనే చనిపోతే నా మాంసం తిన్నవారు ముసలితనము, చావు ఎలాగ తప్పించుకొంటారు?" అని అడిగింది నెమలి. "నీ శరీరం అంతా బంగారమే. కనక నీమాంసం తిన్నవారజరామరులౌతారని అంటున్నారు." అన్నాడు రాజు. దానికి నెమలి ఇలాగ బదులు చెప్పింది.

"మహారాజా ఇదంతా కేవలం మిథ్య. అది అలాగుండగా అసలు నా శరీరం బంగారం కావడానికొక కారణం ఉంది. చాలాకాలం కిందట నేనీ కాశీనగరంలో చక్రవర్తినై ఈ రాజ్యంఅంతా పాలిస్తూ ఇక్కడ పంచశీల ధర్మం ప్రతిష్ఠింపజేశాను. అయితే ఏదో ఒక చిన్న దోషం వల్ల నాకు నెమలి జన్మ వచ్చింది."

కాశీరాజిది విని "దీనికి తార్కాణం ఏదైనా ఉన్నదా!" అని ప్రశ్నించాడు. "లేకేమి? ఈ నగ



లేక విస్సంతరుణ్ణి రాజ్యంనుండి వెళ్ళగొడతారు. అతడు అడవులలో భార్యాపుత్ర సమేతుడై తిరుగుతూ తనకు మిగిలిన రథాలను కూడా కొందరు బ్రాహ్మణులకు దానం చేస్తాడు. ఎడమవైపు చిత్రభాగంలో గజదానం, కుడివైపుభాగంలో రథదానం కనిపిస్తాయి. (గుంటూరుజిల్లా గోలివద్ద గల బౌద్ధశిల్పకళ)

రంలో మంగళపుష్కరిణి లోపల తవ్వితే నా రత్నాల రథం బయట పడగలదు." అని బదులు చెప్పింది నెమిలి.

పిమ్మట ఆ పుష్కరిణి తవ్వి ఆ రత్న రథం పైకితీశారు. మహారాజది చూచి ఎంతో ఆశ్చర్యపడి వారాణాసీ రాజ్యం అంతా ఆ నెమలికి ధారాదత్తం చెయ్యాలని అనుకొన్నాడు. కాని నెమలి దాని కంగీకరించలేదు. కాశీ రాజ్యంలో పంచశీల ధర్మ ప్రతిష్ఠచేసి తిరిగి దండక పర్వత శిఖరానికి వెళ్ళిపోయింది.

శ్రావస్తీ నగరంలో జేతవనంలో నివసిస్తున్న సమ్యక్సం బుద్ధ గౌతమ బుద్ధుడీ గాథ అంతా ఒక భిక్షుకునికి వినిపించి ప్రశాంత స్వరంతో నెమ్మదిగా ఇలాగ ఉపదేశించాడు. 'నాయనా, భిక్షూ! చక్కగా అలంకరించుకొని జేతవనానికి వచ్చిన ఒక సుందరిని గూర్చి నీవు సాభిలాషంగా ప్రసంగించడంలో ఆశ్చర్యం ఏమి ఉంది? మహాశ్రద్ధాళువై మంత్రం పునశ్చరణ చేసే సువర్ణ మయూరమే ఆడునెమలి నృత్యం చూచి మరులుకొని, మంత్రం విస్మరించి, బోయవాని వలలో చిక్కుకొన్నది. కామినీమణులెలాంటివారినైనా మోహపాశాలలో బంధించి వెయ్యగలరు సుమా!

పూర్వ జన్మలో నేనే ఆసువర్ణ మయూరమై అవతరించాను. ఆనందుడు కాశీరాజై అవతరించాడు. నావంటివానికే అలాంటి భ్రాంతి కలిగింది. నాయనా చూశావా? సుందరీమోహ బంధాల వైచిత్రి!" ఆ ఉపదేశం విని భిక్షుకులందరూ బుద్ధదేవుని ప్రశంసిస్తూ జయజయ ధ్వానాలు చేశారు. ★

(అలిండియా రేడియో ప్రసారితం.)

# రాజావవాద జాతకము

పూర్వం వారణాసిలో బ్రహ్మదత్తుడు రాజ్యం చేస్తూ ఉండగా, బోధిసత్త్వుడు బ్రహ్మదత్తుని మొదటి భార్యయొక్క గర్భంలో ప్రవేశించి, గర్భవాసమైనాక కుశలంగా మాతృగర్భంలోంచి బయలుపడ్డాడు. నామగ్రహణదివసమున బ్రహ్మదత్తకుమారుడనే నామకరణం చేశారు. క్రమంగా వయసువచ్చి 16 ఏండ్లవాడైనప్పుడు అతడు తక్షశిలకు వెళ్లి అన్ని కళలయందు అభినివేశం పొంది, తండ్రి అనంతరం రాజ్యానికి వచ్చి ధర్మంగా ఏలుతూవున్నాడు. స్వేచ్ఛావశుడు కాకుండా న్యాయనిర్ణయం జరిపేవాడు. అతడిలా ధర్మంగా రాజ్యం చేస్తూ ఉండగా అమాత్యులు కూడా ధర్మంగానే వ్యవహారం నడిపేవారు. వ్యవహారాల్లో ధర్మంగా నిర్ణయం జరుగుతూ ఉండడంవల్ల మోసం చేసే వాళ్లే లేకుండా పోయారు. అటువంటివాళ్లు లేని కారణంవల్ల న్యాయాలయాల్లో రద్దీ తగ్గిపోయింది. అమాత్యులు ప్రతిదినమూ న్యాయశాలల్లో కూర్చుని కూర్చుని ఎవరూ న్యాయంకోరకు రాకపోగా తిరిగి వెళ్లిపోయేవారు. న్యాయాలయాలు మూసెయ్యవలసిన అవసరం ఏర్పడ్డది. అప్పుడు బోధిసత్త్వుడిలా ఆలోచించాడు. "నేను న్యాయంగా రాజ్యం పాలిస్తూంటే ధర్మనిర్ణయంకోసం వచ్చేవాళ్లే లేకుండా పోయారు. రద్దీ తగ్గిపోయింది. న్యాయాలయాలు మూసెయ్యవలసిన అవసరం వచ్చింది. ఇక నాలోపలి అగుణాలను అన్వేషించవలసిఉంది. 'ఇది నాలోపలి అగుణము' అని తెలుసుకొని, దాన్ని విడిచి గుణములందే వర్తిస్తాను."

అలా అనుకొని అప్పటినుంచీ "నా అగుణాన్ని చెప్పేవాడు ఉన్నాడా లేడా" అని తర్కించుకుంటూ తన సహచరులందరిలోనూ, తన గుణాలను చెప్పేవాళ్ళే గాని అగుణాలను చెప్పేవాళ్లు కనపడకపోగా, "వీళ్లు నావలన భయంవల్ల అగుణాలను చెప్పక గుణాలనే చెబుతారు" అని తలచి బయటివారి నడిగి వాళ్లూ చెప్పకపోగా, నగరంలో అంతటా అన్వేషించాడు. నగరపు నాలుగు ద్వారాలలోపల అగుణాలను చెప్పేవారిని కానక "దేశమంతా అన్వేషిస్తాను" అనుకున్నాడు.

---

"భాస్కర్"

---

రాజ్యభారం మంత్రులపై ఉంచి, రథమధిరోహించి, సారథి సహితుడై అజ్ఞాతవేషంలో నగరంనుంచి బయల్పడి జనపదం అంతా పర్యటించి సరిహద్దువరకూ వచ్చాడు. అప్పటికీ తన గుణాలను కీర్తించేవాడే గాని అగుణాలను చెప్పేవాడు కనపడలేదు. ఆ సరిహద్దున గల మహామార్గంలో రథం మళ్లించి నగరానికి తిరిగి బయల్దేరాడు.

అదే సమయంలో మల్లికుడనే కోసలరాజు కూడా ధర్మంగా రాజ్యం సాగించుతూ, తన అగుణాలను అన్వేషించుకొంటూ, అగుణాలు చెప్పేవాడు కనపడక దేశం అంతా తిరిగి ఆ సరిహద్దు ప్రదేశానికి వచ్చాడు. ఎదురుబదురుగా రథాలు నిల్చాయి. రథంతప్పుకు వెళ్ళేందుకు చోటు లేకపోయింది.

అప్పుడు మల్లికరాజు యొక్క సారథి వారణాసిరాజుయొక్క సారథితో అన్నాడు. "నీ రథాన్ని పక్కకు తీసి మాకు దారి ఇయ్యి" అని.

"కాదు. నీ రథాన్నే తప్పించు. ఈ రథంలో వారణాసి రాజ్య ప్రభువు బ్రహ్మదత్త మహారాజు కూర్చుని ఉన్నాడు" అని అతడు జవాబిచ్చాడు.

"ఓహో సారథీ, ఈ రథంలో కోసలరాజ్యప్రభువు మల్లిక మహారాజు కూర్చుని ఉన్నాడు. కనుక నీ రథం తప్పించి మా రాజుగారి రథానికి దారియ్యి" అన్నాడు.

"ఆయన కూడా రాజేనే, ఇప్పుడెలాగ?" అని యోచించి "సరే ఈ ఉపాయం చేద్దాం-వయస్సడిగి ఎవరు చిన్నవాళ్లయితే వాళ్ళను దారి ఇమ్మందాం" అని నిశ్చయం చేసి కోసలరాజు వయస్సడిగి తెలుసుకున్నాడు. ఇద్దరి వయస్సు సమానం గావటంచేత, రాజ్యపరిమాణం,

బలం, ధనం, యశస్సు, జాతి గోత్ర కులాదులను కూడా అడిగి, ఇద్దరూ మున్నూరు యోజనాల విస్తీర్ణం గల రాజ్యము, సమాన బల, ధన, యశోజాతిగోత్రకులాదులు కలవారని తెలుసుకుని, శీలతారతమ్యాన్ని బట్టి దారి ఇప్పించాలి అనుకుని, "అయితే మీ రాజుగారి శీలాచార మెటువంటిది?" అని అడిగాడు. అతడున్నూ మా రాజుగారి శీల మిటువంటిది అని చెబుతూ ఈ మొదటి 'గాథ'ను పలికాడు.

" 'దృఢత్వమును దృఢత్వము చేతను మృదుత్వమును మృదుత్వము చేతను, సాధుత్వమును సాధుత్వమునను, అసాధుత్వమును అసాధుత్వము చేతను ఈ మల్లికుడు జయించును.' ఇట్టివాడే రాజు-కనుక ఓ సారథీ మార్గంలో నుంచి తొలగు" అన్నాడు.

అప్పుడు వారణాసిరాజుయొక్క సారథి "ఓహో నీ చేత చెప్పబడినవి మీ రాజుయొక్క గుణములా?" అని అడిగాడు. 'ఔను' అన్నాడతడు. "ఇవే గుణాలైతే, ఇంక అగుణమనేదేది?" అన్నాడు ఎత్తిపొడుస్తూ.

"పోనీ, ఇవన్నీ అగుణాలైతే మీ రాజు గుణా లెటువంటివి?" అని అడిగాడు మల్లికరాజుయొక్క సారథి.

బోధిసత్త్వుని సారథి "అయితే, విను" అని ఈ రెండవగాథను పలికాడు.

'క్రోధమును అక్రోధంతోనూ, అసాధుత్వాన్ని సాధుత్వంతోనూ పిసినిగొట్టును దానంతోనూ, అసత్యవాదిని సత్యంతోనూ జయించవలె' ఇట్టివాడే రాజు. కనుక ఓసారథీ మార్గంలో నుంచి తొలగు" అన్నాడు.

ఇలా అనగానే, మల్లిక రాజున్నూ అతని సారథీ కూడ రథం దిగి గుఱ్ఱాలను విప్పి రథం పక్కకు తీసి వారణాసి రాజుకు మార్గమిచ్చారు. వారణాసీరాజు (55-వ పేజీ చూడండి)

బాలగేయం:

# దివ్యస్మృతి

మధురాంతకం రాజారాం

అమృతకలశ మ్మోయి నీదు హృదయమ్ము
అనుపమానమ్మోయి నీదు చరితమ్ము
మగువ మాయాదేవి నోముల పంట!
మానవ జగతిలో నీకెవరు జంట!

పనికిమాలిన కాసు పేదపై విసరి
దానకర్ణులవోలె నుప్పొంగువారు,
ఓ ప్రభూ! నీ మహాత్యాగశీలమును
ఊహించి, వెరగొంది, పులకించలేరు!

అంతఃపురమ్ములో నద్దాలమేడ,
అద్దాలమేడలో నైశ్వర్యమన్న
అవతార పురుష! నీకొకనికే కానీ
అది మరెవ్వరికైన చేదానటన్న!

కాలువిరిగిన మేకపిల్ల కన్నీరు
కదిలించెనే నాడు నీదు హృదయమ్ము!
ఆనాడు మగధ సమ్రాట్టుకే కాదు
అవని కంతయునాయె జ్ఞానోదయమ్ము!

పొగలుచిమ్ముచు మండు హింసాగ్నిపైన
పన్నీరు వర్షించు శాంతిమేఘము నీవు!
విమలాత్మ! నీమాట ఏనాటికైన
విశ్వశాంతికి మంచి బంగారు బాట!

'ఎందాక కులగిరు లెందాక నదులు'
ఎందాక నరజాతి ధరణిపైనుండు
అందాక నిరతమ్ము 'ఆసియా జ్యోతి'!
ఆలపింతుము మేము నీ యశోగీతి!

# కనకపు సింహాసనమున

రాజగృహాన్ని మగధరాజు పరిపాలించే కాలంలో బోధిసత్వుడు ఏనుగరూపంలో పుట్టాడు. ఐరావతాన్ని ధిక్కరించే సోయగముతో చెన్నుమీరే ఆ యేనుగని రాజు పట్టపుటేనుగగా చేశాడు.

ఒకనాడు వుత్సవసమయంలో ఆ యేనుగని అలంకరించి, రాజు పురవీథులలో ఊరేగడానికి బయలుదేరాడు. దారిపొడుగునా జనసమూహం గుంపులు గుంపులుగా చేరి "ఓహో ! ఏమి ఠీవి, ఏమి అందం, నిజంగా మహేంద్రుని వాహనంగా ఉండవలసిన ఏనుగ !" అంటూ పరిపరివిధాల పొగడసాగారు. ప్రజ లీవిధంగా ఏనుగని పొగడటం రాజుకి తనని ఎగతాళి చేసినట్లు వుంది—ఆ యేనుగని ఏ విధంగానైనా చంపించాలని బుద్ధి పుట్టింది. తక్షణం మావటివానిని పిలిచి "నువ్వు దీనిని బాగా తరిఫీదు చేశావా?" అని అడిగాడు.

"చిత్తం మహాప్రభూ!" అన్నాడు మావటీడు.

"నీ మాటలు నేను నమ్మను" అన్నాడు రాజు.

"కాదు మహాప్రభూ ! ఈఏనుగ నా వద్ద బాగా తరిఫీదు పొందింది," అన్నాడు మావటివాడు.

"అలా అయితే ఈ యేనుగని ఆ కనపడే కొండపైకి ఎక్కించగలవా ?"

"చిత్తం, మహాప్రభూ."

"అయితే నన్ను క్రిందికి దిగనిచ్చి దానిని కొండమీదికి ఎక్కించు" అంటూ రాజు దూరంగా తప్పుకున్నాడు.

తక్షణం మావటివాడు ఆ ఏనుగని కొండపైకి ఎక్కించాడు.

తరువాత రాజు తన పరివారంతో కొండపైకి ఎక్కి "ఆ ఏనుగని కొండ అంచుకి పోనియ్" అన్నాడు.

మావటివాడు ఏనుగని కొండ అంచుదాకా పోనిచ్చాడు. తరువాత రాజు ఇలా అన్నాడు:

## పి. ఎస్. గోపాల్

"నీ ఏనుగ అంత బాగా తరిఫీదు పొందినదైతే అది నిల్చునివున్నచోటే మూడుకాళ్ళమీద నిల్చునేలా చెయ్" అన్నాడు.

మావటివాడు తక్షణం ఏనుగని మూడుకాళ్ళమీద నిల్చునేలా చేశాడు.

"సరే! ఇప్పుడు దానిముందు కాళ్ళు రెండింటిమీదా నిల్చునేటట్లు చెయ్" అన్నాడు రాజు.

మావటి సంజ్ఞ చేయగానే అంత ఏనుగ తన మునికాళ్ళు రెండింటి మీదా నిల్చుంది.

"ఇప్పుడు ఒంటికాలుమీద నిల్చునేలా చెయ్ చూద్దాం" అన్నాడు రాజు.

ఏనుగు ఒంటికాలుమీద నిల్చుంది. రాజు ఆశ్చర్యానికి అవధి లేకపోయింది—తన కళ్ళని తనే నమ్మలేకపోయాడు.

"నీకు చేతనైతే దానిని గాలిలో నిల్చునేలా చెయ్!" అని అరిచాడు రాజు.

రాజు దుష్టబుద్ధి మావటీడు గ్రహించాడు — "భారతవర్షంలో ఈ ఏనుగకి ఈడువచ్చే ఏనుగు లేదు—అయినా రాజు ఈర్ష్యతో దీనిని చంపడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇంక ఇక్కడ ఒక్కక్షణం వుండకూడదు" అని ఆలోచించి "నాయనా, ఈ రాజు నిన్ను ఏవిధంగానైనా ఈ కొండమీద నుంచి పడవేసి చంపడానికి ప్రయత్నిస్తున్నాడు. ఈ దుష్టుడు నీ బోటి ఉత్తమునికి తగినవాడు కాదు! నీలోనే శక్తి వుంటే తక్షణం ఆకాశమార్గాన ఎగిరిపో ! పుణ్యాలరాశి వారణాసికి—" అని రహస్యంగా చెవిలో చెప్పాడు మావటీడు.

మానవాతీతమైన శక్తులతో కూడిన ఆ ఏనుగ తక్షణం అంతరిక్షమార్గానికి ఎగిరిపోయింది — ఏనుగపై కూర్చున్న మావటీడు "రాజా, పూర్వజన్మసుకృతంవల్ల మానవాతీతమైన శక్తులని పొందిన ఈ ఏనుగ నీ బోటి మూర్ఖుడిదగ్గర వుండవలసింది కాదు ! మహత్తరమైన ఈ ఏనుగనే కాదు; నీ సర్వస్వాన్నీ నీవు పోగొట్టుకుంటావు—

"కనకపు సింహాసనమున శున

కాన్ని కూర్చోపెడితే దాని నీచపు బుద్ధి ఎక్కడికి పోతుంది?" అని చెప్పి మావటీడు ఏనుగుతో అదృశ్యమైపోయాడు.

అట, కాశీ రాజ్యంలో రాజ ప్రాసాదానికిపైన అంతరిక్షంలో ఆగిన ఏనుగను చూసి అందరు ఆశ్చర్యచకితులైనారు. తక్షణం కాశీరాజు బయటికివచ్చి "కరీంద్రా! నీ ఆగమనం, నా క్షేమానికే ఐతే ధన్యుణ్ణి! నీకు సుస్వాగతం!" అని చేతులు జోడించి పిలిచాడు.

తక్షణం ఆకాశంనుంచి ఏనుగ రూపంలో బోధిసత్వుడు క్రిందికి దిగాడు: మావటీడు ఏనుగపైనుండి దిగి రాజుకు మ్రొక్కాడు. కుశల ప్రశ్నల అనంతరం రాజగృహంలో జరిగిన కథ అంతా మావటీడు కాశీరాజుకు నివేదించాడు.

మీరు చాలామంచిపని చేశారు. మీరు ఇక్కడికి రావడంవల్ల నా జన్మ ధన్యమైనది," అని తన సంతోషాన్ని వెలిబుచ్చి, నగరాన్ని ఎన్నోవిధాల అలంకరించి, ఆ




## 20

ఊరిలోకల్లా వృద్ధు అయిన నరోత్తమ దాస బాబాజీతో అపూకి చాలా రోజులనుంచి స్నేహం. పచ్చని శరీరం, మంచి వర్చస్సు. అతడూ-అదే-ఆ గంగూలీ గారి వీథిని ఓ పూరిపాకలో ఉంటూ ఉంటాడు. ఎప్పుడు చూసినా సంతోషంగానే ఉంటాడు. సందడి, గందరగోళాలంటే కిటవు అతడికి. అంచేత తరుచు ఒంటరిగానే ఉంటూ ఉంటాడు. సాయంత్రమప్పుడు మాత్రం ఎప్పుడైనా గంగూలీ గారి మంటపంలోకి వచ్చి కూచుంటూ ఉంటాడు. అపూ పసితనంనుంచి కూడా హరిహరు డప్పుడప్పుడు వాణ్ణి వెంటపెట్టుకుని బాబాజీ దగ్గరకు వెళ్ళి కూచోటం అలవాటుగా ఉండేది. వాడికి బాబాజీతో అప్పటినుంచే స్నేహం. అపూ ఒకొక్కప్పుడు ఒక్కడూ వెళ్ళి 'తాతా! ఉన్నావా?' అని పల్కరించేవాడు. వృద్ధుడు గబగబా లోపల్నుంచి తాటాకులచాప తీసుకువచ్చి వసారాలో వేసి, 'రా, నాయనా! రా, కూర్చో!' అనేవాడు.

ఎక్కడున్నా అంటే అపూకి తెగని బిడియం, నోటివెంట మాటే రాదు. కాని, సరళస్వభావుడైన ఈ వృద్ధునితో మాత్రం నిస్సంకోచంగా కలిసిపోతాడు. తన సావాసగాళ్ళతో అరమరిక లేకుండా మాట్లాడినట్లే ఇతడితోనూ మనసిచ్చి మాట్లాడతాడు ఉల్లాసంగా. నరోత్తమదాసుకి 'నా' అనేవాళ్ళెవరూ లేరు. వాళ్ళ వైష్ణవులమ్మాయే ఓ అమ్మాయి వచ్చి, ఇంట్లో పనులవీ చేసిపెట్టి పోతూ ఉంటుంది. సాయంత్రమప్పుడు చాలాసేపు అపూ వచ్చి

అనువాదం:

### మద్దిపట్ల సూరి

కూర్చుని, అతడితో కబుర్లు చెబుతూనూ, అతడిచేత చెప్పించుకుని వింటూనూ ఉంటాడు. నరోత్తమదాసు వాళ్ళ నాన్నకంటె పెద్దవాడని, అన్నదారాయ్‌కంటె కూడా పెద్దవాడని వాడికి తెలుసు. ఆ పెద్దతనం వల్లనో, మరి ఎందుచేతో ఆ వృద్ధుడు తన యీడువాడే అన్నట్లనిపిస్తుంది వాడికి. ఇక్కడికి వచ్చేసరికి వాడి సిగ్గు, సంకోచం అన్నీ వాటంతటవే మాయమైపోతాయి. అపూ మాట్లాడుతూ మాట్లాడుతూ మధ్య మధ్య మనసారా నవ్వుతూంటాడు. పెద్దవాళ్ళెక్కడ తనను 'వీడో పెద్ద ఆరిందాలా ఉన్నాడే' అని అంటారో అన్న భయంతో మరెక్కడయినా మాట్లాడ్డానికి సంకోచించే సంగతులన్నీ ఇక్కడ మాట్లాడేస్తుంటాడు. "నువ్వు నా గౌరాంగుడివి నాయనా! నిన్ను చూస్తున్నప్పుడల్లా మా గౌరాంగుడు నీ వయస్సులో సరిగా నీలాగే ఇంత అందంగా, కళకళలాడుతూ, నిష్కల్మషుడుగా ఉండేవాడనిపిస్తుంది. ఆ కళ్ళుకూడా నీ కళ్ళలాగానే భావపరిపూర్ణంగా—" అనటం మొదలెట్టేవాడు నరోత్తమదాస్.

ఆమాట అన్నందుకు యింకెక్కడైనా అయితే అపూ సిగ్గుపడేవాడు. ఇక్కడ మాత్రం వాడు నవ్వుతూ- "తాతా! అయితే మరి ఈసారి ఆ పుస్తకంలో బొమ్మ చూపించు నాకు" అనేవాడు.

వృద్ధుడు ఇంట్లోంచి 'ప్రేమభక్తిచంద్రిక' పట్టుకువచ్చేవాడు. అతడికి అతి ప్రియమైన పుస్తకం అది. ఒంటరిగా కూర్చుని చదువుకుంటూ చదువుకుంటూ తన్మయుడైపోతూ వుంటాడు. అందులో ఉన్న బొమ్మలు మొత్తం రెండే. అవి చూపించటం అయినాక, "నేను చచ్చిపోయేముందు ఈ పుస్తకం నీకే యిచ్చిపోతాను నాయనా! నీకిచ్చినందువల్ల ఈపుస్తకానికి అపచారం జరగదు" - అనేవాడు.

అతడి శిష్యుడొకడు అప్పుడప్పుడు 'పదాలు' రాసి వినిపించటానికి తీసుకొస్తూ ఉండేవాడు. వృద్ధుడు విసుగుతో-"పదాలు అల్లుతున్నావు, మంచిదే, కాని అవన్నీ నాకుమాత్రం వినిపించకు బాబూ! పదకర్తలంటే విద్యాపతి, చండీదాసు - వాళ్ళు వాళ్ళవితప్ప ఇంకేపదాలూ నా చెవికెక్కవు. ఇది తీసుకెళ్లి ఇంకెవరికైనా వినిపించు — అనేవాడు.

సహజ-సామాన్య-నిరాడంబర జీవిత విధానానికి భిన్నంగా ఇక్కడేదో స్వేచ్ఛావాయువు వీస్తున్నట్లుండేది. అది అపూ మనస్సును ఇట్టె పట్టేసింది. అది ప్రకృతితోటి, పక్షులతోటి సాహచర్యంలాగా మనస్సుకెంతో ఆనందంగా ఉండేది. కనుకనే ఆ వృద్ధుని దగ్గరకు వచ్చి కూచునేందుకంత

---

### కనకపు సింహాసనమున

ఏనుగుని పట్టపుటేనుగుగా చేశాడు. తరువాత తన రాజ్యాన్ని మూడు భాగాలుగా విభజించి, ఒకభాగం బోధిసత్వునికి, ఒకభాగం మావటివానికి ఇచ్చి, మూడవభాగం తాను వుంచుకున్నాడు. బోధిసత్వుడు తన రాజ్యంలో అడుగుపెట్టిన నాటినుంచీ, కాశీరాజు ధనధాన్యాలతో తులతూగుతూ కడపట భారతవర్షాన్ని ఏకచ్ఛత్రాధిపత్యముగా పరిపాలించాడు. ★

**జరిగిన కథ:—**

నిశ్చిందిపురం బెంగాల్‌లోని మారుమూల కుగ్రామం. ఆ ఊళ్లో చితికిపోయిన మధ్య తరగతి సంసారి హరిహరరాయ్. అతని భార్య సర్వజయ. కూతురు దుర్గ. హరిహరరాయ్ పెళ్ళయిన తరవాత కొంతకాలం దేశాలు పట్టిపోయి, శాస్త్రాలు, కావ్యాలు చదివి పండితుడై, పదేళ్ళకి తిరిగివచ్చి కాపరంపెట్టాడు. దుర్గ పుట్టిన చాలఏళ్ళకి అతనికి కొడుకు పుట్టాడు. వాడిపేరు అపూ. ఇంట్లో ఎప్పుడుచూసినా 'ఇవాళ ఎలా గడుస్తుందిరా భగవంతుడా' అనే చింతే. కాని పిల్లలకిదేం పట్టింది? దుర్గకి ఒక్కనిమిషం ఇంట్లో కాలు నిలవదు. ఎప్పుడూ ఏ తోటలోనో, ఏ చెట్టుకిందనో ఆడుకుంటూ ఉంటుంది. అపూ ఎప్పుడూ ఊహాలోకంలోనే గడుపుతాడు. వాడికి ప్రతిదీ కొత్తే. ప్రతిదీవింతే. వాడి జీవితపరిధిలోకివచ్చే ప్రతి సాధారణవిషయమూ అసాధారణమైనదిగా, అద్భుతమైనదిగా వాడికి కనిపిస్తుంది. ఒకరోజున అపూను బళ్లోవేశారు. చదువుచెప్పడంకంటె, బడిలోనే ఒకపక్కనఉన్న చిల్లర కొట్టుపని చూసుకోవడం, కొట్టకు వచ్చేపోయేవారితో కబుర్లుచెప్పడమే పంతులుగారికి అలవాటైంది. కొట్లోకివచ్చే గ్రామస్థుల కబుర్లు వింటూ అపూ ఏవో ఆలోచనల్లో తేలిపోతూ ఉండేవాడు. పంతులు ఎప్పుడైనా పాఠంచెప్పినా ఆ మాటలు వాడికి అర్థంఅయ్యేవికావు. అర్థంకాని ఆ శబ్దసముదాయం వెనక వాడికి ఏవో చిత్రవిచిత్రమైన రమణీయలోకాలు, దేశకాలబాధితంకాని ప్రపంచాలు కనిపించేవి. పెద్దవాడైన తరవాత దారికనుక్కొని అక్కడికి వెళ్ళాలని వాడు నిశ్చయించుకున్నాడు. ఆఊరికి కొత్తగా పట్నంనించి నీరేన్ అనే విద్యాధికుడు, ధనాఢ్యుడు వచ్చాడు. అతన్ని చూసి అతడే తనకు భర్తకావాలని దుర్గ కోరుకుంది. తనకోరిక గొంతెమ్మకోరిక అని ఆ పిల్లకు తెలియదు.

అనక్తి కలిగేది వాడికి. తిరిగి వచ్చేప్పుడు అపూ నరోత్తమదాసు ఇంటిముందున్న పాటలి జూకామల్లెలు, సంపెంగలు కోసుకుని వచ్చేవాడు. వాటిని తన పక్కమీద పోసుకునేవాడు. తర్వాత ప్రొద్దుక్రుంకి దీపం పెట్టగానే తండ్రి ఆదేశంప్రకారం చదువుకోటానికి కూర్చోవలసివచ్చేది. గంటకంటె ఎప్పుడూ ఎక్కువసేపు చదివేవాడు కాడు. అప్పటికే ఎంతో ప్రొద్దుపోయినట్లుండేది వాడికి. తర్వాత ఇహ అక్కడినుంచి లేచివెళ్లి పక్కమీదికిపోయి పడుకునేవాడు. ఆ రోజున తాఆడిన ఆటలు, వేసిన గంతులు, పొందిన ఆనందం – అన్నీ తలపుకు వచ్చేవి. పక్కమీద పోసుకున్న జూకామల్లెలు, సంపెంగల వాసనలు అలసిఉన్నవాడి శరీరాన్ని, ఆటలలో గడిచిన క్షణాలకోసమై విరహాతురమైన వాడి పసిప్రాణాన్ని మైమరపింపచేసేవి. పక్కమీద బోర్లగా పడుకుని, పూలమీద ముఖం ఆనించి వాసన చూస్తూ అలాగే పడుకునేవాడు...

ఆరోజున వాళ్ళ అక్క "వనసంతర్పణ చేసుకుందాంరా అపూ?" అన్నది రహస్యంగా.

ఆ వాడకట్టువాళ్ళంతా 'కుల – చండీ' వ్రతసందర్భంగా వనభోజనాలకై ఊరివెనుక మైదానానికి తమ పెరటిగుమ్మంలోంచే వెడుతున్నారు. వాళ్లి అమ్మకూడా వెళ్ళింది కాని, వాళ్లను తీసుకుని వెళ్లలేదు. అక్కడికి ఎవరి బియ్యం, పప్పూ వారు తీసుకు వెళ్లాల్సిందే. అంత స్తోమత తమకి ఎక్కడుంది? వనభోజనాల చోటుకు వెళ్లాక అందరూ తాము దండిగా తెచ్చుకున్న సన్న బియ్యం, పప్పు, కూరలు, నెయ్యి, పాలు, పెరుగు – మొదలైనవన్నీ బయటికి తీశారు. వాళ్లమ్మమాత్రం తాను తెచ్చుకున్న ముతక బియ్యం, ఇంత పెసరపప్పు, రెండు వంకాయలు మాత్రం పైకితీసింది. భువనముఖర్జీ వదినగారి పిల్లలు ప్రక్కనే కూర్చుని కొత్త బెల్లంవేసి చేసిన బియ్యపు పరమాన్నంలో ఇంకా పాలుపోసుకుని తింటున్నారు. సర్వజయ మనస్సు తన పిల్లల్ని గురించి మహా తపనపడింది.

అలాంటి పరమాన్నం అంటే తన బిడ్డలకి–మరీ పిల్లవాడికి తగని ఇష్టం.

ప్రశాంతంగాఉన్న ఆ మైదానం వంచన ఉన్న చెట్లమీద నీరెండ పడుతోంది. వెదురుతోపువైపు తిరిగి చూసేసరికి పిల్లల ముఖాలు తలపుకు వచ్చాయి.

అడవిలా తయారైన నీలమణిరాయ్ నివేశనంలో అటువైపున కొంత చోటు దుర్గ స్వయంగా బాగుచేసి, తమ్ముడితో —

"ఆ చింతచెట్టుకిందికివెళ్లి అమ్మ వస్తున్నదో లేదో చూడు. నేను చప్పునవెళ్లి బియ్యం పట్టుకువస్తాను" అన్నది.

ఓ చిన్న టెంకాయచిప్పలో -చాటుగా జాడీలోంచి ఇంత నూనె వంచుకుని, తీసుకువచ్చింది తాను చాటుగా తెచ్చిన వస్తువులన్నీ తమ్ముడికి అప్పగించి,

"చప్పున తీసుకువెళ్లు. పరుగుతియ్యాలి అపూ! గొడూ అవీ వచ్చి తినకుండా ఉండే చోటు చూసి పెట్టి రా—" అన్నది.

ఇంతలో మాతూవాళ్ళమ్మ వాణ్ణి తీసుకుని పెరటిదారినే మెల్లాలోకి వచ్చింది.

"ఇటునుంచి ఎక్కడినుంచి వస్తున్నావ్?" అని అడిగింది దుర్గ.

మాతూతల్లి ఏనోన్ని యేళ్లున్న మనిషి కాదు. చూపులకు అంత అనాకారి కాదు. కాని మొగుడు పోయినప్పట్నుంచీ కొంచెం ముద్దిగానూ, బక్కగానూ తయారైంది.

"నీలిమైదానంవైపు వెళ్లి కట్టెలు కొట్టుకు వస్తున్నాను. 'బైంచ్' పళ్లు ఉన్నాయి తీసుకుంటావా అమ్మా?" అని అడిగింది.

దుర్గ అడవి అంతా గాలించి తరచు తెచ్చుకుంటూనే ఉంటుందా పళ్లు 'వద్దు నేను కొనను లే' అన్నట్లు తల ఊగించింది.

"తీసుకోరాదుటండీ అమ్మాయిగారూ! ఎంత తియ్యటిపళ్లు చూసి తీసుకువచ్చానని!"

అంటూ ఒళ్లోంచి వాలుగుపళ్లు తీసిచూపిస్తూ "చూడు ఎంతెంత పెద్దవళ్ళో! ఈ కట్టెలు బజారుకు తీసుకెళ్ళి, అమ్మి, ఆ డబ్బులు తెచ్చుకోటానికి చాలాసేపు పడుతుంది. ఈ లోపుగా ఓ కానీపెట్టి మాతూకి పప్పులేవైనా కొని పెడదామని— తీసుకోండమ్మా! కానీకి రెండు ఇస్తాను" అన్నది మాతూ తల్లి.

దుర్గ ఒప్పుకోలేదు, "అపూ! ఆగిన్నెలో కాసిని పేలాలున్నాయికొని, తీసుకువచ్చి పెట్టరా వీళ్లకి" అన్నది. వాళ్లు దొడ్డిదారిని వెళ్లిపోగానే మళ్ళీ ఇద్దరూ తమ సంతర్పణ సరుకులు తీసుకుని వెళ్లారు.

చుట్టూ అంతా అడవి. బయటినుంచి చూస్తే ఏమీ కన్పించదు. బొమ్మరింట్లో పిడతల్లాంటి పెద్ద పిడతతో బియ్యం పొయ్యి మీదపెట్టి, "ఇవిగో ఈ పళ్లు చూశావా అపూ! 'మేటే ఆలూ' ఎంతెంత పెద్దవో తీసుకువచ్చాను ఒక చోటునుంచి. పూంటే వాళ్ల తాళ్లతోపుల్లో ఓ పొదపైన చాలా ఉన్నాయి. అన్నం లో వెయ్యనా?" అన్నది దుర్గ.

అపూ ఎంతో హుషారుగా ఎండిపోయిన పుల్లలూ అవి ఏరుకుని వచ్చాడు. ఇది వాళ్ల మొదటి వనభోజనం. ఇక్కడ నిజమైనదూర నిజమైన అన్నం వండుకుంటున్నామన్న విశ్వాసం వాడికింకా కలగలేదు. బొమ్మరింట్లో వనభోజనంలాంటి ఉత్తుత్తి భోజనానికేం, చాలాసార్లు చేశారు.

ఏమయితేనేంకాని వనభోజనానికి మంచి అనువైనచోటు, అనువైన సమయం లభించాయి. చుట్టూ చిన్న చిన్న చెట్ల గుబుర్లు. అటువైపున కంచెచెట్లమీద దొండపళ్లు దండిగా ఉన్నాయి. మారేడు చెట్ల తోపులో 'శాఖోటక' పుష్పాలు గుత్తులు గుత్తులుగా ఉన్నాయి. మోడువారిన చిన్న చెట్లమీద కాటుకపిట్టలు తెగ గంతులేస్తూ గొడచేస్తున్నాయి. చుట్టూ చెట్లూ పొదలూ మధ్యన చాటుగా—సందడిలేకుండా ఉన్న చోటు. వసంతఋతు వటంవల్ల ఏ పొద చూసినా చక్కగా పచ్చగా గుబురుగా ఉంది. అత్తిచెట్లనున్న పూలగుత్తులు ఆపాడుపడ్డ నివేశానికి వెలుగు నిస్తున్నాయి. పంపరపనస చెట్లపూత కొన్నాళ్ళనుంచి మంచు పడుతూండటంవల్ల రాలిపోయినా, పైకొమ్మలవి ఇప్పటికీ ఇంకా చాలా తెల్లటిపూలున్నాయి.

దుర్గ ఇటీవలి చెట్లూ-చేమలు, దొడ్లూ-దోవలు, బాగా అలవాటైపోయిన ఈ గ్రామంలోని ప్రతి చిన్నప్రదేశాన్నీ అంటిపెట్టుకుని తిరుగుతోంది. రానున్న విరహంలోని ఏ విషాదంలోనో తనకెంతో యిష్టమైన ఈ లొద్దుగుచెట్టుక్రిందనుంచి వెళ్ళేదారి, తమ యింటి వెనుకనున్న వెదురు తోపు, చెట్లనీడలు వ్యాపించిఉండే రేవూ-అన్నీ మిళితమై ఉన్నాయి. తన అపూ-తన బంగారు చిట్టి తమ్ముడు,-తాను ఒక్కక్షణమైనా చూడకుండా విడిచిపెట్టి ఉంటే మనసు పీకే తమ్ముడు-వాణ్ణి విడిచిపెట్టి ఎంత దూరం వెళ్లాలో!

ఒకవేళ తానింక మళ్లీ యిప్పటికి తిరిగి

అమ్మ వంటింట్లో ఉంది. ఐదేళ్ళ రాధ అల్లరి చెయ్యకుండా సావిట్లో ఆడుకుంటోంది. వాళ్ళమ్మ ఓసారి వచ్చి తొంగిచూసేసరికి రాధ వెల్లకిలా పడుకుని చక్కని పాట పాడుకుంటోంది. ఐదు నిముషాలు ఆగి ఆవిడ మళ్ళీ వచ్చేసరికి రాధబోర్లగిలాపడుకొని ఇంకోపాటపాడుతోంది.

"ఆడుకుంటున్నావా తల్లీ" అందావిడ.

"ఔ నమ్మా గ్రామఫోను ప్లేటు ఆట ఆడుకుంటున్నాను. ఇందాకా, ఓ పాట అయిందిగా. అందుకనేమో, ఇప్పుడు ఇంకోపక్క పాడడానికేమో ఇటు తిరిగాను" అంది రాధ.

రాక పోతే నిరమ్‌అత్తలాగా —! ఈ ఇంట్లోనే ఉండేది నిరమ్‌అత్త. పెళ్లయాక కొన్నాళ్లకి ఎక్కడికో వెళ్లిపోయింది. మళ్ళీ పుట్టింటికి రానే లేదు. ఎన్నాళ్లనాటి సంగతో ఇది!—తాను పుట్టిందగ్గిర్నించీ వింటూనే ఉంది. ఆవిడ్ని ముర్షిదాబాద్ జిల్లాలో ఇచ్చారని చెప్తుంటారు. అది ఎంతదూరమో! ఎక్కడో! ఆవిడ సంగతి మళ్లీ కనుక్కున్నవాళ్లే లేరు. అసలున్నదో పోయిందో కూడా ఎవరికీ తెలియదు. నిరమ్‌అత్త మళ్లీ తండ్రినీ చూడలేదు, తల్లినీ చూడలేదు. తమ్ముళ్లనీ చెల్లెళ్లనీ కూడా చూసి ఎరుగదు. ఒక్కొక్కరే అందరూ పోయారు. అమ్మో! మనుషులింత కటికగుండెలవాళ్లలా అవుతారో? ఆమె అతీ-గతీ కనుక్కున్నవాళ్లే లేరుకదా! ఒంటరిగా ఉన్నప్పుడు ఈ నిరమ్‌అత్త తలపుకు వచ్చినప్పుడల్లా ఎన్నిసార్లు కంటతడిపెట్టుకున్నది తాను! ఇప్పుడు హఠాత్తుగా ఆవిడ తిరిగివస్తే ఒకవేళ?...పాడుపడి, అడవిలా తయారైన ఈ పుట్టిల్లుమాసి ఏమనుకుంటుంది?

ఒకవేళ తానుకూడా అలా అయితే? ఈ అమ్మనీ, నాన్ననీ, అపూని విడిచిపెట్టాల్సివస్తే-ఇంక మళ్లీ ఎన్నటికీ చూడటానికి ప్రాప్తం లేకుండా-ఎన్నటికీ-ఈ యిల్లు, ఈ లొద్దుగచెట్లు - ఈ ఏటికి వెళ్లేదారి!— తలచుకుంటే కాళ్ళలోంచి వణుకు పుట్టుకువస్తుంది; ఎందుకు వొచ్చింది! ఇటీవల ఎందుకనో తన జీవితంలో ఏదో త్వరలో ముంచుకురాబోతున్నదని తడుతోంది. ఇంకెన్నడూ జీవితంలో రానిదేదో త్వరలోనే రాబోతున్నది. రాత్రింపగళ్లు ఆడుకుంటున్నా, పాడుకుంటున్నా, పనిచేస్తున్నా మధ్య మధ్య తరచు ఇదే మనస్సుకు తట్టూ ఉంటుంది. అది ఏమిటో తనకి సరిగ్గా తెలియదు. అలా ఎందుకు తట్టున్నదో కూడా తెలియదు. అయినా అదేదో రాబోతోంది, త్వరలోనే రాబోతోందని మాత్రం తోస్తోంది.

వనభోజనం మధ్యలో తను మెల్లాలో ఎవరిదో పిలుపు విన్పించింది. “బినీ గొంతులా ఉందిరా, వెళ్లి రమ్మని పిలిచి తీసుకురారా అపూ!” అన్నది దుర్గ. కొంచెంసేపటికి అపూ వెనకాలే దుర్గ యీడుదే ఓ నల్లటి పిల్ల వచ్చింది. కొంచెం నవ్వి - కొంచెం ఆత్రంగా - “ఏమిటి చేస్తున్నారు దుర్గా దీదీ!” అని అడిగింది.

“రా, బినీ! వనభోజనం చేస్తున్నాం, కూర్చో.”

ఆ అమ్మాయి ఆవీథి కాశీనాథ చక్రవర్తి కూతురు. మాసినగుడ్డ కట్టుకుని ఉంది. చేతిని సన్నటి మామూలు గాజులున్నాయి. కొంచెం పొడగరి. ముఖం మామూలుగానే ఉంటుంది. ఆ పిల్లతండ్రి 'జాగ్' బ్రాహ్మడని ఏ సామాజిక కార్యకలాపాల్లోనూ అతణ్ణి ఎవరూ పిలవరు. వెలివేయబడినవాడిలా ఊరి చివర కాపురం ఉంటున్నాడు. స్థితిగతులు కూడా ఏమీ బాగాలేవు. బినీ దుర్గ పురమాయించిన పనులన్నీ చేసిపెట్టటం మొదలెట్టింది. ఏదో పెత్తనాలకని బయలుదేరి, లాభించే పనిలోకి వచ్చిపడింది. ఇప్పుడు వీళ్లు తననుకూడా ఆ భోజనంలో పాల్గొనిస్తారా లేదా అన్న సంకోచభావం-ఉల్లాసంతో కూడిన ఆపిల్ల మాటల్లో వెల్లడవుతోంది. బినీ! ఇంకా రెండు ఎండుపుల్లలు ఏరుకుని వస్తావా? పొయ్యి సరీగ్గా మండటంలేదు” అన్నది దుర్గ.

బినీ వెంటనే తీసుకురావటానికి పరుగెత్తింది. కాసేపటికల్లా మోపెడు చితుకులు తెచ్చి అక్కడపడేసి, “ఇవి సరిపోతాయా? ఇంకా తీసుకురానా దుర్గాదీదీ?” అన్నది. “బినీ వచ్చింది. అది కూడా ఇక్కడే తింటుంది. ఇంకో గుప్పెడు బియ్యం తీసుకురారా అపూ!”అని దుర్గ అన్నప్పుడు సంతోషంతో బినీకి ఇంతముఖం అయింది. కాసేపయాక బినీ నీళ్లు తెచ్చిపెట్టింది. “ఏమేం కూరలు చేస్తున్నావ్ దుర్గాదీదీ?” అని ఆత్రముతో అడిగింది బినీ.

అన్నందింపి, కాస్తనూనెవేసి వంకాయ ముక్కలు వేయించింది దుర్గ. కాసేపయాక ఆ చట్టికేసి తెల్లబోయిచూస్తూ-అపూని పిలిచి “సరిగ్గా నిజంగా వంకాయ వేపుడు రంగే వచ్చింది చూశావురా అపూ! సరిగ్గా అమ్మ వేయించిన వేపుడులాగానే ఉందికదూ!” అన్నది.

అపూకూడా అంతా ఆశ్చర్యంగానే ఉంది. తమ వనభోజనంలో నిజమైన అన్నం నిజమైన వేపుడుకూర లభ్యమవుతాయని వాడికింతవరకూ నమ్మకం కుదరలేదు. తర్వాత ఇద్దరూ ఎంతో సంతోషంతో అరటిఆకుల్లో పెట్టుకుని తినటం మొదలెట్టారు-అన్నం, వంకాయ వేపుడుకూర. అంతే, ఇంకేంలేదు. అపూ ముద్ద నోట్లో పెట్టుకుంటూంటే దుర్గ వాడికేసి చూస్తూ ఆత్రంగా “వేపుడు ఎలా ఉందిరా?” అని అడిగింది.

“చాలా బావుంది అక్కా! కాస్త ఉప్పు వెయ్యలేదన్నమాట గాని-!” ఇవాళ వంటపదార్థాలజాబితాలో ఉప్పును పూర్తిగా మరిచేశారు. ఉప్పు ఏకరువునకూడా వెయ్యలేదు. కాని ముగ్గురూ ఎంతో సంతోషముతో రామ్ములక్కాయలు, నీళ్లు తక్కువై అడుగంటిన వంకాయవేపుడు వేసుకుని వనభోజనం చేస్తున్నారు. దుర్గ తొలివంట ఇది. ఆశ్చర్యంతో, ఆనందంతో తనచేతి నైపుణ్యాన్ని తనలో తనే మెచ్చుకోసాగింది. (ఇంకా ఉంది.)

# పుష్పాంజలి

(12 వ పేజీ తరువాయి)

వెళ్ళిపోయారు. బుద్ధదేవుడు శిష్యగణంతో కలిసి రాజగృహామహావిహారానికి మరలిపోయాడు. ఇక చక్రవర్తి ఒక్కడే కొందరు పరిచారకులతో కలిసి ఆ ఉద్యానవనంలో విహరిస్తున్నాడు. కొంతసేపటికి తోటమాలిని తన సన్నిధికి తీసుకురావలసిందని ఆజ్ఞాపించాడు. అతడక్కడికి వచ్చాడు. కాని ఎక్కడా చెక్కు చెదరలేదు! చక్రవర్తితో ప్రాణభిక్ష పెట్టవలసిందని ప్రార్థించవయ్యా! అని భార్య అతనికి శతవిధాలుగా చెప్పిచూచింది. తోటమాలి ఇంతకుపూర్వం దీనికి కొంచెం మెత్తబడేవాడేమో! కాని చక్రవర్తే స్వయంగా బుద్ధదేవునికి పాదపూజ చేసిన తరువాత తానిక ప్రాధేయపడవలసిన అవసరమేమీ లేదనీ, తన ప్రాణాలు పోయినాసరే అన్నిటికీ సిద్ధమేనని అన్నాడు!

తోటమాలి చక్రవర్తి సన్నిధికి వెళ్లగానే బింబిసారు డతనిమీద విరుచుకుపడ్డాడు. కాని తోటమాలి దానికేమి చలించలేదు! తప్పిదం మన్నించవలసిందనికూడా వేడుకో లేదు! అందరు తోటమాలి కిక శిరశ్ఛేదనమో, నగరనిర్వాసనమో తప్పదని నిశ్చయించారు. దూరందూరంగా నిలుచున్న తోటమాలి భార్యభర్త మూర్ఖత్వాని కనేకవిధాలుగా వాపోయింది. అటు పిమ్మట చక్రవర్తి కన్నెరజేసి తోటమాలికేసిచూచి, వెంటనే స్వీయ భవనానికి వెళ్లిపోయాడు. ఆ మరునాడు తోటమాలి కిక శిరశ్ఛేదం జరగక తప్పదని అక్కడివారందరు నిశ్చయించారు.

కాని ఆ మరునాటి ఉదయం తోటమాలి, అతని భార్య తాము విన్నది నిజమేనా? ఎంతైనా ఆశ్చర్యపోయారు!

తోటమాలికి రాజగృహనగరోద్యానా లన్నిటిమీద ఆధిపత్యం వచ్చింది! రాజదూత స్వయంగా ఆ చక్రవర్తి శాసనం చదివి వినిపించాడు!

చక్రవర్తి తోటమాలి చేసిన పూజకై ఇంకా ఎనిమిదేసి మత్తగజాలు, ఉత్తమాశ్వాలు, ఎనిమిదికుండాల సువర్ణ దీనారాలుకూడా బహూకరించాడు. ప్రత్యేకంగా అతని పరిచర్యకై ఎనమండుగురు పరిచారికలనుకూడా ప్రసాదించాడు.

తోటమాలి భార్య ఈ మహాదృష్టవర్షానికెంతైనా ఆనందించిందిగాని, “అయ్యో! నీలాంటి వెర్రినాగమ్మకు దాసీపిల్లలు కూడానా! నేను చాలనా!” అని ఆక్షేపనిగా విరగబడి నవ్వింది!



డిటెక్టివ్ సీరియల్

మూలం: ఎడ్గార్ వాలెస్

# అరుణవలయం

అనువాదం: "ప్రద్యుమ్న"

## 12 ఫెలిక్స్ మార్ల్ బూట్లు

ఫెలిక్స్ మార్ల్ తన పడకగదిలో తలుపులు వేసుకుని కూర్చున్నాడు. ఇరవైఅయిదేళ్ల క్రితం అతడు టులూజ్ ఫ్రెంచి కారాగారంలో ఉన్నప్పుడు బూట్లషాపులో పని చేశాడు. బూట్లు బాగు చెయ్యడం అతడు ఆ రోజుల్లో బాగా నేర్చుకున్నాడు. కాని ఇప్పుడతడు బూట్లు బాగు చెయ్యడం లేదు; పాడుచేస్తున్నాడు. పదునైన చాకు తీసుకుని, చివర కోసుగా ఉన్న తనబూట్లను ముక్కలు ముక్కలుగా కోసివేస్తున్నాడు. ఆ బూట్లను మొత్తం అతడు మూడేసార్లు ఉపయోగించాడు. కోసివేసిన ముక్కలను మంటలో పడేస్తున్నాడు.

కొందరు మనుషులకు ప్రతిదీ గాఢమైన అనుభూతిగా తయారవుతుంది. ఫెలిక్స్ మార్ల్ ఒకయుగంలో పడవలసినంత బాధను ఒకదినంలో పడగలడు. బియర్డ్ మోర్ ఎస్టేటులో ఒకచోట బూటుగుర్తులు కనిపించాయని ఏదోపత్రిక ప్రకటించింది. అదివరకే.అనేక భయాలతో చెదిరిపోయిన ఇంత లావుపాటిమనిషి, ఈవార్తతో మరింత బేజారెత్తిపోయాడు. చెమటలు కక్కుకుంటూ బూట్లను ధ్వంసం చేసివేస్తున్నాడు.

ఈకార్యక్రమం సక్రమంగా జరిగిపోయిన తరవాత చాకు ముడిచివేశాడు. చేతులు కడుక్కున్నాడు. తోలు కాలుతున్న వాసన బయటికిపోయేందుకు గాను కిటికీ తలుపులు తెరిచాడు.

తను మొదట అనుకున్న ప్రకారం చేస్తే బావుండిపోయేదిగదా. రివాల్వరును వదిలిపెట్టి ఫౌంటెన్ పెన్‌తో పనిచేసినందుకు తన పిరికితనాన్ని తనే తిట్టుకున్నాడు. అయితే ఒక సుగుణం ఉంది. బియర్డ్ మోర్ ఎస్టేటులో దాగిఉన్నప్పుడు తనను ఎవరూ చూడలేదు. కనుక ఆ భయం లేదు.

ఫెలిక్స్ మార్ల్ వంటి మనుషులకు ఎంత అకారణంగా భయం జనిస్తుందో, అంత అకారణంగానూ మళ్ళీ ధైర్యంకలుగుతుంది. అతడు మేడమెట్లు దిగి తన లైబ్రరీగదిలోకి వచ్చేలోగా ఇందాకటి భయాలు, ఆందోళనలు అన్నీ మరిచిపోయాడు.

ఆరోజున మసకచీకటివేళ రాజీపడుతూ, దాదాపు కాళ్ళమీద సాష్టాంగపడుతున్నంతదీనంగా ఒక ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరం సరిగానే అందజేశానని భావించాడు. కొంపతీసి ఆ ఉత్తరం దొరికిపోతే? ఫెలిక్స్ మార్ల్ గుండె మళ్ళీ గుబగుబలాడింది.

"ఏడిసింది!" అని మళ్ళీ గుండె దిటవు చేసుకున్నాడు.

నౌకరు టీ తెచ్చి డస్కుపక్కన చిన్న బల్లమీద పెట్టాడు.

"సార్! ఆ పెదమనిషిని రమ్మంటారా?"

"ఏ పెద్దమనిషి?" అని మార్ల్ అడిగాడు.

"మిమ్మల్ని చూడడానికి ఎవరో వచ్చారని చెప్పాను గదండి."

మార్ల్ ఇందాక తను బూట్లు ధ్వంసం చేస్తున్నప్పుడు తలుపు తట్టబడినదని జ్ఞాపకం చేసుకున్నాడు.

"ఎవరతడు?" అని మార్ల్ మళ్ళీ అడిగాడు.

"ఆయన విజిటింగ్ కార్డు మీ బల్లమీద పెట్టానండి."

"నేను పనిమీద ఉన్నానని చెప్పలేకపోయావా?"

"చెప్పానండి. కాని మీరు కిందికి వచ్చిందాకా వేచిఉంటానన్నారండి."

విజిటింగ్ కార్డును నౌకరు అందించాడు. అది చూసి ఫెలిక్స్ మార్ల్ త్రుళ్లిపడ్డాడు. మొహం పాలిపోయింది.

"ఇన్‌స్పెక్టర్ పార్! నాతో అతని కేంపని?" అనుకున్నాడు. "లోపలికి రమ్మను" అని నౌకరుతో చెప్పాడు.

మార్ల్ ఇన్‌స్పెక్టర్‌ను ఇదివరకు ఎప్పుడూ చూడలేదు. పొట్టిగా ఉన్న పార్‌ను చూడగానే కాస్త ధైర్యం కలిగింది. ఇన్‌స్పెక్టరు ఆకారం ఏమంత భయంకరంగా లేదు.

"కూర్చోండి ఇన్‌స్పెక్టర్! మీరు వచ్చినప్పుడు నేను తొందరపనిలో ఉన్నాను" మార్ల్ పడే ఆందోళన అంతా అతని కంఠంలోనే వ్యక్తం అవుతోంది.

పార్ దగ్గరలో ఉన్న కుర్చీలో కూర్చున్నాడు. టోపీతీసి మోకాళ్లమీద పెట్టుకున్నాడు.

"మిస్టర్ మార్ల్! మొన్న జరిగిన బియర్డ్ మోర్ హత్యసందర్భంలో మిమ్మల్ని చూద్దామని వచ్చాను. అందుచేత ఆలస్యమైతే అయిందని మీకోసం వేచిఉన్నాను."

మార్ల్ మౌనం వహించాడు. అతి ప్రయత్నంమీద వణుకుతున్న పెదవులను బిగపట్టి, చాలా మర్యాదగా వింటున్నట్లు కూర్చున్నాడు.

"మీకు బియర్డ్ మోర్‌తో బాగా పరిచయం ఉందా?" అని పార్ అడిగాడు.

"బాగా పరిచయంలేదు. మాకు వ్యాపార సంబంధాలు మాత్రం ఉన్నాయి."

"ఇదివరకు ఆయ నెప్పుడన్నా కలుసుకున్నారా?"

మార్ల్ తటపటాయించాడు. నోరుతెరిస్తే అబద్ధం తప్ప రాని మనుష్యుల్లో అతనొకడు. సరిగా ఉన్నదానికి వ్యతిరేకంగా చెప్పే స్వభావం అతనిది.

"ఊహూ," అన్నాడు. చాల ఏళ్ళకిందట ఎప్పుడో చూశాను. అప్పటి కాయనకి ఇంకా గడ్డమున్నా రాలేదు."

"మీరు బియర్డ్ మోర్ గృహంలో అడుగు పెట్టేటప్పుడు ఆయన ఎక్కడ ఉన్నాడు?"

"డాబామీద నుంచుని ఉన్నాడు," అని మార్ల్ ఎందుకో బిగ్గరగా అరిచాడు.

"మీ రాయన్ని చూశారా?"

మార్ల్ తల ఊపాడు.

"మిస్టర్ మార్ల్! మీరప్పుడు· రొంగుకో ఉలికిపడ్డారని తెలిసింది. క్షణంసేపు మీరు భయభ్రాంతులై పోయారని జాక్ బియర్డ్ మోర్ చెప్పాడు. ఏమిటి కారణం?"

మార్ల్ భుజా లెగరవేశాడు. బలవంతాన నవ్వు తెచ్చుకుని "ఇదివరకే చెప్పానే! నాకు గుండెజబ్బు ఉంది. ఉండుండి నొప్పి వస్తూంటుంది," అన్నాడు.

[illegible] చిత్రం ఉన్నట్లుగా పరిశీలిస్తూ "బియర్డ్ మోర్ ను చూసి కాదన్న మాట," అని ప్రశ్నించాడు.

"కాదు, కాదు" అని మార్ల్ ఖండితంగా చెప్పాడు. "బియర్డ్ మోర్ ను చూసి రెండు భయపడలేను. నేనాయనతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాను. ఆయన్ని బాగా ఎరుగుదును—"

"కాని చాల నీళ్ళయిందిగా మనిషిని కలుసుకుని?"

"అవును నిజమే" అని మార్ల్ విసుగ్గా అన్నాడు.

"అయితే మీరు అదిరిపడడానికి కారణం ఉండదనొప్పి అన్నమాట."

ఇన్‌స్పెక్టరు తలెత్తి మార్ల్ కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగాడు.

"నిస్సందేహంగా. మీరు ఇప్పుడు గుర్తు చేసేదాకా నాకసలా సంగతి గుర్తే లేదు," అన్నాడు మార్ల్.

"ఇంకో సందేహం కూడా ఉంది. అది కూడా చెప్పండి," అన్నాడు ఇన్‌స్పెక్టరు. మళ్ళీ తన టోపీకేసి దృక్కులు మరల్చాడు.

"బియర్డ్ మోర్ గృహానికి మీరు వెళ్ళినప్పుడు చివర కోసుగా ఉన్న బూట్లు ధరించారు గదూ?"

మార్ల్ కనుబొమలు చిట్లించాడు.

"ఏమో. నాకు జ్ఞాపకం లేదు."

"మీరు రైల్వే స్టేషనుకు వెళ్ళినప్పుడు కాక, ఆ తర్వాత ఆ ఎస్టేటు భూములలో కొంతదూరం నడిచారా?"

"లేదు."

"ఇంటి చుట్టూ తిరగలేదా?"

"లేదు. నేను ఆ యింట్లో కొన్ని నిమిషాలు మాత్రమే ఉన్నాను. తరవాత వెళ్ళిపోయాను."

పార్ తలెత్తి ఇంటి లోకప్పును చూస్తున్నాడు.

"మీరా దినం తొడుక్కున్న బూట్లు చూపిస్తారా?"

"తప్పకుండా!"

మార్ల్ పొడుగాటి బూట్లు తీసుకొచ్చి చూపాడు. అవి చివర కోసుగా ఉన్నాయి.

పార్ వాటిని చేతిలోకి తీసుకుని మడమల దగ్గర పరీక్షించాడు.

"ఇవి మీరాదినం తొడుక్కున్నవి కావు. మడమలవద్ద దుమ్ము ఉన్నది. వారంరోజుల నుండి కురుస్తున్న వానకి కాస్తయినా బురద అంటుకుని ఉండాలి."

మార్ల్ గుండె ఆగిపోయినంత పనైంది.

"ఈ బూట్లే నేనారోజు తొడుకున్నాను. మీరు దుమ్ము అని దేన్ననుకుంటున్నారో అది ఎండిపోయిన బురద. దుమ్ముకాదు" అని మార్ల్ జవాబిచ్చాడు.

పార్ తనవేళ్లకు అంటుకున్న దుమ్ము చూస్తుంటూ "పొరపాటు [illegible]రను కుంటాను మిస్టర్ మార్ల్! ఇది సుద్ద దుమ్ము," అని బూట్లు కింద పెట్టిలేచి నుంచున్నాడు. "ఏదైనా ఒకటే లెండి" అని తలవంచి ఆలోచిస్తూ చాలాసేపు నిలుచున్నాడు. మార్ల్ కొంచెం విసుగుతోచే విధంగా,

"ఇంకా ఏమన్నా ఉందా అడగాల్సింది?" అన్నాడు.

"అవును మీ టెయిలర్ పేరు, అడ్రెసు కావాలి, ఓ చీటి మీద రాసి ఇవ్వండి."

"టెయిలరా? వాడితో మీకేం పని?" అని ఆశ్చర్యపడి, నవ్వి "మీరు చిత్రమైన వారండీ మిస్టర్ పార్! దానికేముంది రాసిస్తాను" అన్నాడు మార్ల్.

పార్ చీటి తీసుకుని, దానికేసి చూడనైనా చూడకుండా జేబులో పెట్టుకున్నాడు.

"మీకు అనవసర శ్రమ కలిగించినందుకు ఏమీ అనుకోకండి. హత్య జరగడానికి ఇరవై నాలుగు గంటలముందు నుంచీ బియర్డ్ మోర్ ఇంటికి వచ్చిన వారందరినీ దర్యాప్తు చేయవలసిన అవసరం ఉంది. అరుణవలయం—"

"అరుణవలయమా?" అని మార్ల్ అదిరిపడ్డాడు. ఇన్‌స్పెక్టరు అతనికేసి సూటిగా చూశాడు.

"హత్యకు బాధ్యత అరుణవలయం మీదనని మీకు తెలియదా?"

నిజానికి ఫెలిక్స్ మార్ల్‌కు ఆ విషయం తెలియదు. జేమ్సు బియర్డు మోర్ హత్య వార్తను ఏదో పత్రికలో చదివాడు కాని, ఆ హత్యకు అరుణవలయంతో సంబంధం ఉందనే సంగతి 'మానిటర్' పత్రిక మాత్రమే ప్రకటించినందువలన, ఆ పత్రిక అతడు ఎప్పుడూ చదవడు గనుక, అతనికా విషయం తెలియదనే అనాలి.

మార్ల్ నీరసంగా కుర్చీలో కూలబడ్డాడు.

"అరుణవలయం— నే నెప్పుడూ అనలే—" అని మళ్ళీ తమాయించుకున్నాడు.

"మీరనుకోని దేమిటి మార్ల్?" అని ఇన్‌స్పెక్టరు అడిగాడు.

"ఇదే ఈ అరుణవలయం! నే నిదేదో చిన్న—" వాక్యం ముగించలేదు మార్ల్.

ఇన్‌స్పెక్టరు వెళ్ళిపోయిన గంట దాకా ఫెలిక్స్ మార్ల్ కుర్చీలో అలాగే తలపట్టుకుని కూర్చున్నాడు.

అరుణవలయం!

ఆ పేరు అతని మనస్సును కల్లోలం చేసివేసింది.

"ఏం బాగాలేదు!" అని గొణుక్కున్నాడు.

ఆ సాయంత్రమంతా తన బ్యాంక్ బుక్కును పరిశీలిస్తూ గడిపాడు. ఈ పరిశీలన అతనికి చాలా తృప్తి కలిగించింది. ఇంకా కొంచెం [illegible] పుచ్చుకోవాలని తలపోశాడు.

(ఇంకా ఉంది)

### యావజ్జీవ కఠిన కారాగార శిక్ష

"నీకు కఠినాతికఠిన శిక్ష విధించబోతున్నాను" అన్నాడు న్యాయమూర్తి. న్యాయస్థానంలో జనం చెవులు రిక్కించి తీర్పుకై ఎదురుచూడసాగారు. ఒక్క క్షణం ఆగి, న్యాయమూర్తి తీర్పు ప్రకటించారు.

"నిన్ను జైలుకి పంపి హాయిగా కాలం గడపనివ్వను. ఈ క్షణాన విడుదల చేస్తున్నాను. పన్నులభారం, నిరుద్యోగం, రాజకీయాలు, హైడ్రోజన్ బాంబు వల్ల వాటిల్లే ప్రమాదం మొదలైన వాటితో యాతనపడు."

## రాజావవాద జాతకము

(47-వ పేజీ తరువాయి)

మల్లికరాజుకు 'ఇలా చేయవలసి ఉంది' అని తెలియజెప్పి నాకగానికి పోయి దానము మొదలైన పుణ్యకర్మలుచేసి జీవితాంతమందు స్వర్గం పొందాడు. మల్లికరాజున్నూ అగుణవాదిని చూచినవాడై తన నగరానికి వెళ్లి దానాది పుణ్యకర్మలుచేసి జీవితాంతమున స్వర్గం పొందాడు.

([illegible]

★ న్యూఢిల్లీ లేఖ ★

(9-వ పేజీ తరువాయి)

విలు ఉపన్యాసాలిస్తే ఎంత బాగుంటుంది! ప్రణాళికా రచయితల అభిప్రాయాలే ఇక్కడ ఉటంకిస్తాను.

"(1) పంచవర్ష ప్రణాళికను వార్షిక ప్రణాళికలుగా, కార్యక్రమాలుగా విభజించవలసి ఉంటుంది. ఏ యేటా జరిగిన పనులనుబట్టి ప్రణాళిక నిర్వహణను అంచనా కట్టాలి. ప్రణాళికా కార్యక్రమాలలోను, ప్రాజెక్టులలోనూ మార్పులు చేయరాదని దీని అర్థం కాదు. కాని ఈ మార్పులు వార్షిక కార్యక్రమంలో భాగాలుగానే ఉండాలి గాని అప్పటికప్పుడు చేయబడినవై ఉండకూడదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వార్షిక బడ్జెట్ ఒకటి తయారుచేసుకుని పని చేస్తాయి కనుక పంచవర్ష ప్రణాళికలో ఒక్కొక్క ఏడాదికి కేటాయించబడిన కార్యక్రమాలను మార్చడానికి సర్దుబాటు చేసుకోడానికి ఈ బడ్జెట్లు బాగా పనికి వస్తాయి. అయితే మార్పులను, సర్దుబాట్లను ఆర్థిక వ్యవస్థయొక్క సమగ్రావసరాలను, ఆ యేడు జరగవలసిన పనులను దృష్టిలో పెట్టుకుని ప్రణాళికాధికారులు చెయ్యాలి.

(2) పంచవర్ష ప్రణాళిక అయిదేళ్ల మీదా జరగవలసిన పనులను స్థూలంగా నిర్దేశిస్తుంది. ఈ స్థూల స్వరూపంలోపల ఒక్కొక్క యేడే నెరవేరవలసిన ప్రణాళికలు తయారవుతాయి. అయిదేళ్ల మీద జరగవలసిన పనులను నిర్దేశించే ప్రణాళిక విధిగా మార్పులకు లోనుగాక తప్పదు. ఏయే భారీ కార్యక్రమాలను తలపెట్టవలసిందీ, ఈ కార్యక్రమాలవల్ల ఏయే ప్రయోజనాలు ఏ వరుసలో సిద్ధించవలసిందీ, వాటికి కావలసిన ధన సాధన సంపత్తిని ఎలా సేకరించవలసిందీ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక నిర్దేశిస్తోంది. ప్రభుత్వం అనుసరించే విధానాలను కూడా ప్రణాళిక స్థూలంగా నిర్వచిస్తోంది. అయితే ప్రణాళిక ఎక్కడా మార్పుకు అవకాశం లేని పదార్థం కాదు. నూతనావసరాలనుబట్టి మార్పులు రావలసిందే. ఖర్చు అంచనాలలో విధిగా కొన్ని సందిగ్ధ విషయాలుంటాయి. ప్రణాళికలోని కొన్ని కార్యక్రమాలకు మరికొంత ఎక్కువకాలం పట్టవచ్చు. నిర్వహణలో గడిస్తున్న అనుభవాన్నిబట్టి కొన్ని కార్యక్రమాలను నిర్దిష్టవ్యవధికంటె తక్కువలోనే నెరవేర్చవచ్చు మరికొన్నిటిని వ్యవధిదాటిన తరువాతనే నెరవేర్చవలసి రావచ్చు. పైగా భారత ఆర్థికవ్యవస్థ పూర్తిగా తన మీద తాను ఆధారపడిన వ్యవస్థ కాదు. అంతర్జాతీయంగా సంభవించే రాజకీయ, ఆర్థిక పరిణామాలవల్ల ప్రణాళికలో కొన్ని మార్పులు చేయవలసి రావచ్చు. అందుచేత ఏయేటికాయేడు కార్యక్రమాలను వివరంగా తయారుచేసుకుని, అమలు చేయవలసి ఉంటుంది.

(3) ఏయేడు కార్యక్రమాలకు ఎంత కావలసి ఉంటుందో మొదటినుంచీ సమగ్రమైన అంచనాలు ఉండడం అవసరం. ఎందుకంటే, కావలసిన యంత్రసామగ్రులకు, ముందే ఏర్పాట్లు చేసుకోవాలి. సిబ్బందిని కూడా సిద్ధం చేసుకోవాలి."

కాని ప్రణాళికనుచూస్తే, వివిధ పరిశ్రమలు తమకు కావలసిన యంత్రసామగ్రులకై ముందే ఏర్పాట్లు చేసుకోడానికి కావలసినంత సమగ్రంగా అంచనాలు తయారు కాలేదని తెలుస్తోంది.

ప్రణాళికను ఎన్నికల సమయానికే ప్రారంభించ తలపెట్టినందువల్ల కూడా ప్రణాళికలో ఇంత అవాస్తవికత ప్రవేశించడానికి వీలైందని అనిపిస్తోంది. కేంద్రప్రభుత్వంలోని ప్రతిమంత్రి తాను మళ్ళీ ఎన్నుకోబడితే ఏమేమి చేస్తాడో ప్రణాళికను అడ్డంపెట్టుకుని నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తాడు.

ఏ శాఖకు ఎంత కేటాయించాలనే అంశంపై వ్యక్తుల పలుకుబడినిబట్టి నిర్ణయాలు జరుగుతాయనేది స్పష్టమవుతోంది. ఉదాహరణకు, విద్యామంత్రి ముందు ఒక మ్యూజియము, ఒక థియేటరు, తరవాత ఎప్పుడో ఒక లైబ్రరీ స్థాపించ నిశ్చయించారు.

ఉత్తరాది వేరు, దక్షిణాది వేరు అని మైసూరు ముఖ్యమంత్రి వాదం. ఈ వాదాన్ని కొంతవరకు మదరాసు ఆర్థికమంత్రి, ఆంధ్ర ముఖ్యమంత్రి బలపరుస్తున్నారు. పారిశ్రామికవిధానంతోను, ద్వితీయ పంచవర్ష ప్రణాళికతోనూ మనిషికీ మనిషికీ మధ్యనే కాక, రాష్ట్రానికీ రాష్ట్రానికీ మధ్య కూడా ఆర్థిక వ్యత్యాసాలను తగ్గించాలని నాయకులు ఆశిస్తున్నారు. కాని దక్షిణాది వారు తమకు ఉత్తరాదివారికీ మధ్య ఉన్న వ్యత్యాసాలు తొలగింపబడతాయా అని అనుమానిస్తున్నారు.

ప్రజాస్వామిక పరిపాలనలో అవకాశాలు అందరికీ సమానంగా ఉండాలనేది ఎంత నిజమో త్యాగాలుకూడా అందరూ సమానంగా చెయ్యాలనేది అంత నిజం. ద్వితీయ ప్రణాళికా కాలంలో మధ్య తరగతి ప్రజలు చేయవలసివచ్చేటంత త్యాగాలు కార్మికవర్గం చేస్తుందా అని ప్రశ్న. మధ్యతరగతి ప్రజలలాగా కార్మికులు ఊరికే ఉండరు కనుక, ఆందోళన, అల్లర్లు జరుపుతారు కనుక కార్మికవర్గాన్ని మంచి చేసుకుంటున్నారు.

బడ్జెట్ సిద్ధాంతాన్ననుసరించి, ఆదాయానికి ఇక వేరే మార్గాలు ఏవీ కనబడనప్పుడు తప్ప ప్రభుత్వాలు కొత్త పన్నులు విధించరాదు కాని ప్రణాళికలో అలా గత్యంతరం లేనిపరిస్థితి ఏర్పడిందనేసూచన ఎక్కడా కానరావటంలేదు.

* * *

సఫ్దార్ జంగ్ ఆస్పత్రి నెమ్మదిగా కొత్త రూపు దాలుస్తోంది. యుద్ధకాలంలో కట్టిన చిన్న చిన్న కట్టడాలతో కూడిన ఈ ఆస్పత్రి అమెరికనకోసం ఉద్దేశించినది. దీనికి ఖర్చు ఎక్కువ అవుతున్నకొద్దీ ఉపయోగం తగ్గుతూవచ్చింది. ఇప్పుడు సఫ్దార్ జంగ్ ఆస్పత్రి ఇదివరకులాగా ఇర్విన్ ఆస్పత్రికి అనుబంధసంస్థగా పని చెయ్యడంలేదు. ఇప్పుడది స్వతంత్రంగానే పనిచేస్తోంది. కుతుబ్ రోడ్డు పరిసరాల్లో నివసించే జనాభాకు ఇది ఉపయోగపడుతున్నది. కేంద్ర ప్రభుత్వోద్యోగులకు కూడా ఇది ఉపయోగపడుతున్నది. కేంద్రప్రభుత్వోద్యోగులకు కూడా ఇది ఉపయోగపడుతున్నది. దీనికిటీవల కాన్సర్ శాఖ చేర్చబడింది. ఈ శాఖ భవనానికి ఆర్థిక మంత్రి ఇటీవలే శంకుస్థాపన చేశారు. రోగనిదాన శాఖ కూడా త్వరలో చేర్చబడుతుంది. ఎక్స్‌రే, రేడియమ్ చికిత్సాపద్ధతికూడా ప్రవేశపెట్టబడుతుంది.

శవనాగారం, లాండ్రీ, ప్రసూతి వైద్యశాల, శిశుసంరక్షణాలయం-వీటన్నిటికీ భవనాలు తయారవుతున్నాయి. ప్రసూతి వైద్యశాల మాత్రం ఆ ప్రాంతపు అవసరాలకు తగినంతగా లేదనిపిస్తుంది. ఇంకా సిబ్బంది కూడా తగినంత లేరు.

జూన్ ఒకటవ తేదీనుంచి అస్థివైద్యశాల భవన నిర్మాణం ప్రారంభమవుతుంది. రోగ స్వభావ నిర్ణయశాఖ కోసం, ఎక్స్‌రే కోసం మరో నాలుగంతస్తుల భవనంకూడా ప్రారంభిస్తారు ఈ భవనంలో 102 మంది రోగులకు వసతిఉంటుంది. నర్సుల భవనానికి రూ. 9 లక్షలుపెట్టి భవనం కడతారు.

ఆస్పత్రిని ఎయిర్ కండిషన్ చేయాలని ఒక సూచన ఉన్నది. ముఖ్యంగా పిల్లల వార్డును ఎయిర్ కండిషన్ చేసేందుకు ఏర్పాటుచేయాలి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఈ ఆస్పత్రికి 66 లక్షల రూ. మంజూరుచేశారు. తయారయిన తరవాత ఢిల్లీలోకల్లా ఇదే మంచి ఆస్పత్రి కాగలదు. ★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



సాంచీ స్తూప పశ్చిమద్వారం

బుద్ధుని అస్థికలను పూజించబోతున్న శేపాలీ మల్లులు, బుద్ధాస్థికలకోసం యుద్ధాయత్తులై వెళుతున్న రాజ సైన్యం, మారుని పరాజయం మొదలైన విశేషాలు దీనిపై కనిపిస్తాయి.